# గురూజీ చెప్పిన కథలు

సంకలనం

ప॥ పూ॥ శ్రీ గురూజీ సంకలన సమితి

అనువాదం

శ్రీ కె శ్యాంప్రకాశరావు

శ్రీ కె శ్రీనివాసమూర్తి


ప్రచురణ

నవభారతి ప్రచురణలు

ఒర్కాత్‌పురా - హైదరాబాదు

# ముందు మాట

చిన్న చిన్న కథల ద్వారా పెద్ద విషయాలను చెప్పటం కొత్త పద్ధతేమీ కాదు ఋషులు పూర్వం అలాగే బోధించారు ఉపనిషత్తుల నిండా చిన్న చిన్న కథలే

పరమ పూజనీయ శ్రీ గురూజీ రాష్ట్రీయ స్వయంసేవకసంఘ్ శాఖలలో యిచ్చిన ఉపన్యాసాలలో అనేక విషయాలను యిలా చిన్న కథల ద్వారానే చెప్పారు సంఘ్ కార్యకర్తలకు అవి ఉపయోగపడగలవనే ఉద్దేశంతో ఈ చిన్న పుస్తకాన్ని మీకు అందజేస్తున్నాం అనువాదకులు శ్రీ కె శ్యాంప్రకాశరావుకు శ్రీ కె శ్రీనివాసమూర్తికి కృతజ్ఞతలు

ప్రకాశకులు

# 1 మాటలతోపాటు అనుభూతికూడా కావాలి

మాటలు అందరూ చెప్పుతారు కాని వాటితోపాటు అనుభూతి కూడా లెకపోతే ప్రయోజనం వుండదు ఈ సందర్భంలో నాకు కలిగిన అనుభవం ఒకటి చెబుతాను

ఓ పెద్ద నాయకుడు మన సంఘ స్థాపకులైన డాక్టర్‌జీతో కలవ వానికి వచ్చారు ఆ రోజుల్లో పూజ్య డాక్టర్‌జీ చాలా అనారోగ్యంగా ఉన్నారు వారితో ఎవరినీ ఎక్కువసేపు మాట్లాడనీయవద్దని కూడా డాక్టర్లు చెప్పారు నేనీ విషయం ఆ నాయకునితో చెప్పి మీరు మాట్లాడ దల్చుకున్న విషయాలన్నీ నాతో మాట్లాడి ఇంకా ఏమైనా మిగిలివుంటే కొద్దిసేపు మాత్రమే డాక్టర్జీతో మాట్లాడండని చెప్పాను అందుకు వారొప్పు కున్నారు మేం అనేక గంటలు చర్చించుకున్నాం అనేక ప్రశ్నలు వారడుగుతుంటే నెను సమాధానమిస్తూ పోయాను అడిగిన ప్రశ్నలేమళ్ళీ అడిగినా విసుక్కోకుండా సమాధానా లిచ్చాను ఇక వారికి సంతృప్తి కలి గిందని డాక్టర్‌జీని కలిసి వారితో నాలుగు మాటలు లాంఛనంగా మాట్లాడి వెళ్తారని అనుకొని సంతోషంతో డాక్టర్జీ వద్దకు వారిని తీసుకొని వెళ్ళాను కాని వారు నన్నడిగిన ప్రశ్నలన్నింటినీ మళ్ళీ డాక్టర్జీని అడగటం మొదలు పెట్టారు డాక్టర్జీతో వారు చాలసేపు చర్చిస్తారని దానివల్ల డాక్టర్జీ ఆరో గ్యం దెబ్బతింటుందని నేను చాలా భయపడ్డాను కాని నా అదృష్టం బాగుండి అలా జరుగలేదు వారి ప్రశ్నలన్నింటికీ డాక్టర్జీ ఒక చిన్న వాక్యంలోనే సమాధానం ఇచ్చారు దాంతోనే వారికి సంతృప్తి కలిగింది మీరు చెప్పింది చాలా నిజం అని వారు డాక్టర్జీతో అన్నారు ఇదిచూసి

# 3 స్నేహానికి గీటురాయి

ఈ రోజుల్లో అమెరికాను కొందరు రష్యాను కొందరు తమ మిత్రులుగా భావిస్తున్నారు ఈ విధంగా ఎవరితోనో ఒకరితో మిత్రత్వం నెరపి వాళ్ళ సహాయంతో మన దేశాన్ని రక్షించుకోటానికి వీలవుతుందని వీళ్ళ అభిప్రాయం ఈ సందర్భంలో నాకొక కథ జ్ఞాపకం వస్తుంది

పూర్వకాలంలో గుర్రం పెంపుడు జంతువు కాదు అది స్వేచ్ఛగా అడవుల్లో తిరుగుతుండేది ఒకసారి ఒక పెద్ద పులి ఒక గుర్రం వెంట బడింది గుర్రం ప్రాణభయంతో పరుగెత్తసాగింది చాలా సేపు పరుగెత్తి అది అలసిపోయింది కాని పులి మాత్రం దాన్ని వెంటాడటం విడువలేదు గుర్రం బాగా అలసిపోయి ప్రాణంమీద ఆశగూడ వదులు కున్నది కాని యింతలోనే దానికొక మనుష్యుడు కనిపించాడు అది ఆ మనుష్యుడితో తమ్ముడూ! నన్ను పులి బారినుండి కాపాడు అని వేడు కున్నది నేను పులితోనైతే పోరాడతాను కాని నేలమీద నిలబడి సాధ్యం కాదు నీ వీపు మీద నన్ను కూర్చోనిస్తే దాని మీద నుండి పోరాడగలను" అని మనుష్యుడు సమాధానమిచ్చాడు గుర్రం అతని మాటకు ఒప్పుకుంది మనుష్యుడు గుర్రం మీద స్వారీచేస్తూ పులిని చంపాడు గుర్రం ప్రాణాలు దక్కాయి అది చాలా సంతోషంతో వినమ్ర భావంతో మీరు నాకు చాలా ఉపకారం చేసారు చాలా కృతజ్ఞురాలను ఇక నా దారిన నేను వెళ్ళిపోతాను నా వీపు మీద నుంచి దిగండి అని మనుష్యుని ప్రార్థించింది అప్పుడు మనుష్యుడు తమ్ముడూ! నీ వీపుమీద కూర్చుంటే నాకు చాలా హాయిగా వుంది ఇక దిగాలనిపించటం లేదు అని గుర్రానికి సమాధానం ఇచ్చి ఇక దాని వీపు దిగలేదు అప్పటినుంచే గుర్రం మనిషికి బానిస అయిందని చెబుతారు

# 5 నిష్కళంక శీలం

కార్యకర్త యొక్క శీలం నిష్కళంకమైందిగా వుండాలి పవిత్ర జీవితం గురించి వేలెత్తి చూపే అవకాశం శత్రువుకు కూడా లభించ కూడదు మన సంఘ నిర్మాత డాక్టర్‌జీ జీవితమే ఇందుకు నిదర్శనం

సుమారు 1934 35 సంవత్సరం సంగతి కాంగ్రెసు రెండుగా చీలి పోయింది బహూశా దాని జాతకంలోనే చీలికలు రాసి వున్నట్లున్నాయి ఒక వర్గానికి నాయకుడుగా ప్రసిద్ధులైన ఒక బారిష్టరు రెండవ వర్గానికి నాయకుడుగా డాక్టరు ముంజేగారు వున్నారు 1935 సం॥లో వీరిద్దరు ఒక ఎన్నికలో ఒకరితో ఒకరు పోటీకి నిలబడ్డారు ఆ బారిష్టరుగారు చాలా తెలివిగలవారు డా॥ ముంజె వారిని సమర్థించేవారి వ్యక్తిగత జీవితాల్లో వున్న చెడునంతా వారు సేకరించి బహిరంగ సభల్లో దాన్ని ప్రజల ముందుంచి వాళ్ళను అప్రతిష్ఠ పాలు చెస్తుండేవారు

డాక్టర్ ముంజేగారి సమర్థకుల్లో మన డాక్టర్జి కూడ వున్నారు డాక్టర్జి విప్లవ కార్యకర్త కూడ కావటంవల్ల ఆ రోజుల్లో వారి సంరక్షణ భారం అంతా డా॥ ముంజెగారే వహిస్తుండేవారు వారిద్దరి మధ్య చాలా ఆత్మీయమైన సంబంధం వుండేది దిని కారణంగా డా॥ ముంజేగారి బహిరంగ సభ లన్నిటిలో డాక్టర్‌జి కూడ తప్పకుండా పాల్గొంటుండె వారు వారి సమక్షంలో ప్రజలు డా॥ ముంజేగారి ఉపన్యాసాలను ప్రశాంతంగా వినేవారు

పీలైతే డాక్టర్‌జీని కూడ సమాజంలో అప్రతిష్ఠ పాలు చెయాలని బారిష్టరుగారు ఆలోచించి వారి పూర్వ చరిత్రనంతా తెలుసుకోవాలని ప్రయత్నించారు చివరకొక బహిరంగ సమావేశంలో వారు డాక్టర్‌జీని

యోగి అరవింద పేరు వారి దృష్టికి వచ్చింది శ్రీ అరవింద ఆ సమయంలో అధ్యాత్మిక సాధనలో నిమగ్నులై పాండిచేరి ఆశ్రమంలో వున్నారు పూర్వాశ్రమంలో వారు విప్లవకారులే యోగదీక్ష తీసుకున్న తర్వాత కూడ సమయం వచ్చినప్పుడు నేను మళ్ళీ రాజకీయాల్లో ప్రవేశిస్తానని వారు చెప్పారు తిలక్‌జీ మరణం తర్వాత వారి అనుయాయులు యోగి అరవింద మళ్ళ రాజకీయాల్లో ప్రవేశించే సమయం ఆసన్నమైందని భావించారు విప్లవకార్యంలో కలిసి పనిచేయుటంవల్ల డాక్టర్ ముంజేగారికి యోగి అరవింద గారితో మంచి పరిచయం వుంది అందువల్ల పాండిచెరిలో వారిని కలిసి మాట్లాడి రావటానికి డా॥ ముంజె వారి వెంట ఒక సేవకుడు రైల్లో మద్రాసుకు ప్రయాణం ఐనారు డా॥ ముంజే మొదటి తరగతి పెట్టెలో సేవకుడు అప్పటి మూడవ తరగతి పెట్టెలో కూర్చున్నారు మద్రాసుకు ముందు స్టేషనులోనే సేవకుడు ముంజేగారి సామాన్లు సర్ది సిద్ధం చేయటానికి వారి పెట్టెలోకి వెళ్ళాడు కాని సామాను సర్దుతుండగానే రైలు కదలినందువల్ల అతడు ఆ పెట్టెలోనే వుండిపోయాడు

మద్రాసు స్టేషను రాగానే సేవకుడు మొదటి తరగతి పెట్టె దిగి తన మూడవ తరగతి పెట్టె వైపు వెళ్ళుతున్నాడు ఇంతలో టిక్కెట్టు కలెక్టరు వచ్చి టిక్కెట్టు చూపించమని అడిగాడు సేవకుడు తన మూడవ తరగతి టిక్కెటునే తీసి చూపించాడు మూడవ తరగతి టిక్కెటుతో నువ్వు మొదటి తరగతిలో ప్రయాణం చేస్తున్నావు ఇది పెద్ద నేరం రెట్టింపు చార్జి వసూలు చేయటమే కాక నీకు శిక్ష కూడ విధిస్తాను అని టికెట్టు కలెక్టరు సేవకునితో అన్నాడు తాను మూడవ తరగతి పెట్టెలోనే ప్రయాణం చేసానని తన యజమాని మొదటి తరగతి పెట్టెలో వున్నందున ఆయన సామాన్లు సర్దటానికి అతనివద్దకు వచ్చానని సేవకుడు చాలా నచ్చచెప్పటానికి ప్రయత్నించాడు కాని టిక్కెటు కలక్టరు

వేదాంతం యోగం మొ॥ విషయాలు నేర్చుకోవాలనే కుతూహ లంతో ఒక యువకుడు దివ్యజ్ఞాన సమాజం అధ్యక్షురాలు డా॥ అనిబి సెంటు దగ్గరికివెళ్ళి తన కోరికను తెలియచేసాడు చిన్న పనులు చేయ టంలో ఇతనికెంత నేర్పు ఉందో తెల్సుకోవాలనే వుద్దేశంతో డా॥ అనిబి సెంటు ఆ యువకునితో నేనిప్పుడు చాలా తొందర పనిలో వున్నాను అంతవరకు ముందర గోడమీద మేకు కొట్టి ఈ క్యాలండర్ దానికి తగి లించు అని చెప్పి ఒక మేకు సుత్తి క్యాలండర్ అతని చేతికిచ్చి అతడెలా పని చేస్తాడోనని సూక్ష్మంగా పరిశీలించసాగింది

యువకుడు గోడమీద ఒకచోట మేకు పెట్టి సుత్తితో పెద్ద దెబ్బ కొట్టాడు గోడ సున్నం రాలిపోయి మేకు వంకర పోయింది కాని గోడ లోకి అది దిగలేదు డా॥ అనిబిసెంటు ఇదంతా చూస్తూ వుంది యువకుడు గోడలో మేకు దిగటంలేదని వచ్చి ఆమెతో చెప్పాడు ఆమె వెంటనే లేచి వంకరపోయిన మేకును సంచెం దగ్గరున్న స్టూలుమీద నిలబడి ప్రవేశద్వారానికి సంగా ఎదురుగా అందరికీ కనబడే స్థలం చూసి అక్కడ మేకు సులభంగా పొగల్గిన రెండు ఇటుకల సందులో దాన్ని పెట్టి సుత్తితో చిన్నగా ఒక్కటె దెబ్బ వేసింది మేకు వెంటనే గోడలోకి దిగింది డా॥ అనిబిసెంటు క్యాలండర్ దానికి తగిలించింది యువకుడిదంతా చూస్తున్నాడు

అనిబిసెంటు అతడితో క్యాలండర్ గోడ మీద ఎక్కడ తగిలించాలి? మేకు ఎక్కడ కొట్టాలి? మొదలైన చిన్న సంగతులే నీకు తెలియవు కాబట్టి యోగం వంటి పెద్ద సంగతులు నేర్చుకోవటం నీకిప్పుడే సాధ్యం కాదు వెళ్ళు అన్నది కాబట్టి చిన్న పని కూడ చక్కగా చేయాలనే శ్రద్ధ వుండాలి

పడేదికాదు ఆ విషయం తల్లికి తెలియజేయటానికే నేనీ పని చేసాను అని అతడు సమాధానం ఇచ్చాడు కాబట్టి తప్పు చిన్నదైనా వెంటనే సరి చేయటం అవసరం

## 10 అహింస యొక్క స్వరూపం

బుద్ధ భగవానుడు గొప్ప అహింసావాది వారు అహింస యొక్క అర్థం స్పష్టంగా వివరించారు

ఒకసారి శత్రు సైన్యం దండెత్తి వచ్చినదన్న సంగతి రాజుకు తెలిసి అతడు సేనాపతిని పిలిచి వెంటనే సైన్యం తీసుకొని వెళ్ళి దండయాత్రను ఎదుర్కో అన్నాడు సేనాపతి యుద్ధంచేస్తే హింస జరుగుతుందనే భయంతో బుద్ధ భగవానుని శరణు వేడి దండయాత్రను ఎదుర్కోటానికి యుద్ధం చేస్తే అందులో శత్రువులు అనేక మంది మరణిస్తారు చాల హింస జరుగుతుంది కాబట్టి యుద్ధం చేయటం ఉచితమేనా? అని అడిగాడు

ఒకవేళ మన సైన్యం దండయాత్రను ఎదుర్కోకపోతే శత్రువులు వెనక్కు తిరిగిపోతారా? అని బుద్ధ భగవానుడు సేనాపతిని అడిగాడు వెళ్ళరు అని సేనాపతి సమాధానం ఇచ్చాడు

శత్రువులు మన రాజ్యంలో జొరబడి సర్వనాశనం చేయకుండా నిరపరాధులైన స్త్రీ పురుషులను చంపకుండా వుంటారా? అని బుద్ధుడు మళ్ళీ సేనాపతి నడిగాడు మనం యుద్ధంచేయక పోయినా శత్రువులు వెనక్కుతిరిగివెళ్ళరు మనలను చంపుతారు అని సేనాపతి సమాధానం ఇచ్చాడు ఇప్పుడు బుద్ధభగవానుడు ఒకవేళ మనం సైన్యాన్ని పంపి

## 12 సజ్జన స్వభావం

సంపూర్ణ సమాజంలో ప్రతి వ్యక్తి యెడల మనకు మిక్కిలి స్నేహము ఆత్మీయభావము వుండాలి అందరికీ మేలు చేయాలనే కోరిక మనకు కీడుచేసే వాళ్ళకుకూడ మేలే చెయాలనే భావము మనకుండాలి

ఒక నదిలో ఒక సాధువు స్నానం చెస్తున్నాడు ఒక తేలు ఆ నదిలో పడి ప్రవాహానికి కొట్టుకుపోతున్నది నీళ్ళలో మునిగి అది చనిపొయేట్లు వుంది స్నానం చెస్తున్న సాధువుకు దాన్ని చూసి చాల జాలి కలిగింది అతడు తన చేత్తో దాన్ని నీళ్ళ నుండి పైకితీయవోయాడు కాని చెయి స్పర్శ తగలగనే అది అతడి చేతిని కుట్టింది సాధువు చెయి దులిపాడు తేలు మళ్ళి నీళ్ళలోపడి మునిగిపోతున్నది సాధువు మళ్ళీ దాన్ని తీసాడు అది మళ్ళి అతడిని కుట్టింది ఈ విధంగా సాధువు తేలును పైకి తీస్తూనే వున్నాడు అది అతడిని కుడుతూనే వుంది ఈ వింత దృశ్యం చూస్తున్న అక్కడి జనులు సాధువును ఇలా అడిగారు మహాత్మా! తేలు మిమ్ములను మాటి మాటికి కుడుతున్నా మీరు దాన్ని నీళ్ళనుండి ఎందుకు బయటికి తీస్తున్నారు? దానికా సాధువు చాల విచిత్రంగా ఇలా సమాధానం ఇచ్చాడు తనను తాకిన వస్తువును కుట్టడం తేలుయొక్క స్వభావం నీళ్ళలోపడి మునిగిపొతున్నా కూడ అది తన స్వభావాన్ని వదలటం లేదు బాధపడుతున్న ప్రాణికి సేవ చేయటం సాధువుయొక్క స్వభావం కర్తవ్యం కూడ ఒక చిన్న తేలు కాటుకు భయపడి నేను నా స్వభావం ఎందుకు విడిచిపెట్టాలి?

Acid) రెండు సామాన్యమైన ఉష్ణోగ్రత 15° లలో వున్నాయనుకొందాం రెంటిని కలిపినప్పుడు కూడ అదే ఉష్ణోగ్రత వుండాలి కాని అవి చాలా వేడెక్కుతాయి గ్లాసు చేత్తో పట్టుకోవటం కూడ సాధ్యంకాదు అధికమైన ఈ వేడి ఎక్కడి నుండి వచ్చింది? ఇది సంఘటన వల్ల వచ్చింది ఒక దాంతో ఒకటి కలసినందువల్ల ఈ ఎక్కువ వేడి నిర్మాణమయింది

## 14 రాజనీతి సాధనమేకాని సాధ్యంకాదు

మనుష్యుడు తన శరీరానికి తగినట్లు బట్టలు కట్టుకుంటాడు బట్టలకు తగినట్లు శరీరాన్ని ముక్కలు చెక్కలు చేయడు రాజకీయాలు సమాజ సేవకు ఒక సాధనం మాత్రమే కాని అవే సర్వస్వం కాదు క్షణికమైన రాజకీయ ఆకర్షణలకు లోబడి మనం మన ధర్మం సంస్కృతి భాష చివరకు చరిత్రను కూడ మార్చివేస్తున్నాం

ప్రోక్రస్టీజ్ అనే క్రూరుడైన రాక్షసు డొకడు అరణ్యంలో వున్న తన కుటీరం వైపునుంచి వెళ్ళుతుండే బాటసారులను తన కుటీరానికి ఆహ్వానించి ఒక మంచంమీద పడుకోబెట్టేవాడు ఒకవేళ బాటసారి కాళ్ళు మంచం కంటె పొడవుంటే ఆ క్రూరుడు వాటని నరికివేసేవాడు ఒకవేళ అవి చిన్నవిగా వుంటే బలంగా గుంజి వాటిని పొడవు చేసేవాడు బాట సారులను చంపి తినటానికి ఆ రాక్షసుడు ఈ విధమైన ఒక కొత్త పద్ధతిని అవలంబించాడు

మన దేశ నాయకులు కూడ రాజకీయాలనే మంచం యొక్క పొడవును బట్టి దేశాన్ని ముక్కలు చెక్కలు చేస్తున్నారు దీని ఫలితంగా మిక్కిలి ప్రాచీనమైన మన జాతీయ జీవనం భయంకర దుష్పరిణామాలకు లోనైంది

చక్కగా పంటవున్న ఒక రైతు పొలంలో ఒక పక్షి గూడు కట్టుకొని తన ఎల్లలతో పాటు నివసిస్తున్నది పంట కోతకు రాగానే ఆ రైతు తన కొడుకును ఎలిచి చూడు పంట కోతకు వచ్చింది మన బంధువులందర్నీ సహాయానికి రమ్మని ఎలిచిరా! అన్నాడు గూటిలో వున్న పక్షి ఎల్లలు ఆ మాటలు విని భయపడి సాయంత్రం తమ తల్లిరాగానే దానితో మనం ఈ రోజే ఎక్కడకైనా వెళ్ళిపోదాం ఈ రైతు తన పొలంలో పంట కోయటానికి రేపే రమ్మని తన బంధులకు కబురు చెసాడు అని చెప్పాయి తల్లి వాటితో ఏం తొందరలేదు రేపే ఏం అయ్యేదిలేదు మీరేం భయపడకండి అని చెప్పింది అది చెప్పినట్లే జరిగింది ఒక్క బంధువు సహాయానికి రాలేమ అందుకని పంట కూడ కోయలేదు

మరునాడు ఆ రైతు విచారంతో కొడుకును ఎలిచి ఒక్క బంధువు సమయానికి రాలేదు మంచిది నువ్వు వెళ్ళి రేవు పంట కోయమని మన నౌకర్లతో చెప్పు అన్నాడు పక్షి ఎల్లలు ఈ మాటలు విని భయపడి మళ్ళీ సాయంత్రం తల్లి రాగానే దాంతో ఈ సంగతి చెప్పాయి మీరేం భయపడకండి ఏం కాదు అని మళ్ళీ తల్లి వాటికి ధైర్యం చెప్పింది రెండవ రోజు కూడ అదే జరిగింది ఒక్క నౌకరు కూడ పొలానికి రాలేదు

నిరాశ చెందిన రైతు తన కొడుకును ఎలిచి మన సహాయానికి ఎవరూ వచ్చెట్లు లేరు మన పని మనమే చేసుకోవటం మంచిది రేపుదయమే మనిద్దరం కల్సి పంట కోయడం ప్రారంభిద్దాం అన్నాడు పక్షి పిల్లలు ఈ మాటలు కూడ విని సాయంత్రం తల్లిరాగానే దానితో చెప్పాయి వెంటనే తల్లి ఐతే ఇక మనం ఈ పొలం విడిచి కొత్త చోటికి వెళ్ళాలి రేపు వాళ్ళు స్వయంగా పూనుకొని పంట కోస్తారు అని చెప్పి అది తన

వచ్చి ఇంద్రుని శరిరంలో కలిసిపోయాయి అవి అతని శౌర్యం సంపద మొదలైన సద్గుణముల యొక్క ప్రతిరూపాలు మేం శీలం యొక్క సేవకులం శీలం దగ్గరున్నంతవరకు మేం నిన్ను సేవించాం శీలంతో పాటే మేం కూడ నిన్ను విడిచి వెళ్ళుతున్నాం అని ఆ తేజోమూర్తులు ప్రహ్లాదునితో పలికాయి చివరకు దేదీప్యమానమైన కాంతితో ప్రకాశించే ఒక స్త్రీ ఆకారం ప్రహ్లాదుని శరీరం నుండి బైటికి వచ్చి నేను నీయొక్క రాజ్యలక్ష్మిని నేను కూడ శీలం యొక్క సేవకురాలినే అందువల్ల దాని వద్దకే నేను వెళ్ళుతున్నా నని పలికి వెళ్ళిపోయింది

ఈ విధంగా ప్రహ్లాదుడు తన సమస్త శక్తులను రాజ్యమును కోల్పోగా ఇంద్రుడు తిరిగి తన సింహాసనం అధిష్టించాడు శీలవంతునికి సమస్త శక్తులు వాటంతటవే లభిస్తాయని శీలం లేకపోతే సమస్త శక్తులు దూరం అవుతాయని ఈ కథయొక్క సారాంశం

## 18 శక్తియొక్క రహస్యం

మన మిత్రుడొకాయన తీర్థయాత్రలకు వెళ్ళి వచ్చి తన అనుభవం ఒకటి చెప్పాడు ఆయన ముస్లిం మహాత్ముని (పీర్) సమాధి (దర్గా) వద్దకు గూడ వెళి వచ్చాడట వెళ్ళిన వాళ్ళను అక్కడ ఉండే ఒక ఫకీరు అక్కడే ఉన్న పెద్ద బండను ఎత్తమనేవాడు ఒక్కొక్కరే దాన్ని ఎత్తాలని ప్రయత్నించేవారు కాని ఎత్తలేకపోయేవారు అప్పుడా ఫకీరు అందరినీ పిలిచి వాళ్ళ ఒక్కొక్క వేలు ఆ బండమీద ఉంచమని చెప్పి పీర్ సాహెబ్‌కిజై అని నినాదం ఇచ్చి ఇక ఎత్తండి అనేవాడు వెంటనే అందరూ ఒక్కసారే ఆ బండను ఎత్తగానే బండ ఒక్కసారే పైకి లేచేది ఇదంతా ఆ పీర్ సాహెబ్ యొక్క మహత్తేనని ప్రజలు అనుకునేవాళ్ళు

ఒక పెద్ద బుట్ట అతని నెత్తిన పెట్టి తాను వెనుక నడుస్తూ చంద్రశేఖర్‌ను ఆ పోలీసు అధికారి ముందునుంచే ఇంటి బైటికి తీసుకు వెళ్ళింది. చంద్ర శేఖర్ పోలీసుల చేతికి చిక్కకుండా ఎటో వెళి పోయాడు.

చంద్రశేఖర్ ఆజాద్ తన మిత్రుని ఇంట్లో ఉంటూ తన సంపర్క ప్రభావంతో ఆ కుటుంబం అంతటిలో దేశభక్తి సాహసం సమయ స్ఫూర్తి మొదలగు సదుణాలను నిర్మాణం చేసాడు. మనం ఎక్కడ ఉన్నా ఈ విధంగానే ఉండాలి. ఇదే మనకు ఆదర్శం.

## 20 హిందూదేశంలో హిందూకాలనీ ఎందుకు?

మన సంస్థకు రాష్ట్రీయ స్వయం సేవక సంఘం అని పేరు పెట్ట టానికి ముందు దిన్ని గురించి చాలా ఆలోచన జరిగింది. రాష్ట్రీయ పదం వుండటం వల్ల ముస్లింలు, క్రైస్తవులు అందరికీ ఇందులో ప్రవేశం ఇవ్వాల్సి వస్తుందని కొందరు అభ్యంతరం పెట్టారు. ఐనా ఈ పదమే స్వీకరించబడింది. ఈ క్రింది సంఘటనను పరిశీలిస్తే దీని ఉద్దేశ్యం చక్కగా బోధపడుతుంది.

బొంబాయిలో హిందూ కాలనీ అనే పేరుగల బస్తీ ఒకటుంది. ఆ బస్తీలో ప్రముఖులు కొందరు తమ బస్తీ పేరులో ఉన్న కాలనీ అన్న విదేశీ పదం తొలగిస్తే బాగనుకున్నారు. వాళ్ళు పేరు మార్చే ఉద్దేశంతో ఒకచోట సమావేశం అయినారు. మన సంఘ స్థాపకులైన పూజ్య డాక్టర్జీ ఆ సమయంలో బొంబాయిలోనే ఉన్నందువల్ల వారినికూడ వాళ్ళు తమ సమావేశానికి పిలిచి ఈ విషయంలో వారి అభిప్రాయం అడిగారు. కాలనీ అన్న పదంకంటే ముందు మార్చాల్సింది హిందూ అన్న పదమే అని

ఎప్పుడైతే క్రీస్తును చెరసాల్లో బంధించారో అప్పుడే అతని శిష్యు లంతా ఎటువాళ్ళు పారిపోయారు ఆ శిష్యుడు మాత్రం రహస్యంగా చెరసాల దగ్గరకె వచ్చి కూర్చున్నాడు కొద్దిసేపటికే అటువైపు ఒక రక్షక భటుడు వచ్చి ఎవరునువ్వు? అని అడిగాడు నేనొక బిచ్చగాడిని ఇక్కడ పడిపోయాను అని శిష్యుడన్నాడు ఆ నీచుడైన క్రీస్తుకు శిష్యుడ వైతే కాదుగదా? అని రక్షకభటుడు మళ్ళీ అడిగాడు కాదు తమ్ముడూ కాదు! నేనా క్రీస్తును ఎరగను కూడ ఎరగను అని శిష్యుడు సమాధానం ఇచ్చాడు రక్షకభటుడు వెళ్ళిపోయాడు తర్వాత వరసగా రెండవభటుడు మూడవభటుడు వచ్చారు అందరికీ అతడు అదే సమాధానం ఇస్తున్నాడు మూడవభటుడితో శిష్యుడీ మాటలు అంటుండగానే కోడి కూసింది అతడెలా పతనం చెందాడో అప్పుడతనికి అర్థమైంది అహంకారం మంచిదికాదనే నీతిని ఈ కథనుండి మనం గ్రహించాలి

## 22 నిజమైన దానం

చాలకాలం క్రితం ఒకసారి పెద్ద కరువు ఏర్పడింది తినటానికేమీ దొరకటంలేదు ఒక కుటుంబం అనేకరోజులు ఉపవాసాలతోనే గడిపింది కుటుంబ సభ్యులంతా మరణానికి సిద్ధపడ్డారు ఒకరోజు వాళ్ళకు కొద్దిగా జొన్నపిండి దొరికింది దాంతో ఐదు రొట్టెలు చేసుకొని నల్గురం నాల్గు తిందాం ఐదవది భగవంతుడికి సమర్పిద్దాం అనుకున్నారు రొట్టెలు సిద్ధం చేసుకొని తినటానికి కూర్చున్నారు ఇంతలో ఒక ఆకలి గొన్న వ్యక్తి అరుపు వినపడింది చూస్తే ఒక మానవ అస్థిపంజరం వచ్చి వారి ముందు నిలబడి వుంది

గృహ యజమాని తన వంతు రొట్టెను అతని కిచ్చాడు కాని దాంతో అతడి ఆకలి తీరలేదు తర్వాత వరసగా భార్య కొడుకు కోడలు

అదే సమయంలో గుజరాతు సరిహద్దుల్లో మహ్మదీయ సైన్యం నిలిచి వుంది గుజరాతును జయించటానికి అది విఫల ప్రయత్నాలనేకం అదివరకే చేసివుంది ప్రధానమంత్రి ఢిల్లీ వెళ్ళి మొగలు రాజును కలిసి తన రాజును శిక్షించటానికి సహాయం చెయమని అడిగారు

ఇలాంటి సదవకాశం లభించినందుకు మొగలు రాజు చాల సంతోషించాడు రాజ్య రక్షణయొక్క రహస్యాలన్నీ ప్రధానమంత్రి ద్వారా తెల్సుకొని అతడు గుజరాత్ మీద దండయాత్ర జరిపాడు ఫలితంగా అత్యంత శక్తిశాలియైన సరిహద్దు రాజ్యం శత్రువు చేజిక్కింది దాని తర్వాత ఒక్క గుజరాతే గాక సంపూర్ణ దక్షిణ భారతం మహమ్మదీయుల పద ఘట్టనలకు నలిగిపోయినవి చివరకా ప్రధానమంత్రికి కూడ పరాభవం తప్పలేదు రాజుతో బాటే ప్రధానమంత్రి బంధువులు కూడ అనేక వేలమంది ముస్లిం కత్తులకు ఎరయైనారు అతని కళ్ళముందే లెక్కలేనంతమంది స్త్రీలు అవమానించబడ్డారు దేవాలయా లనేకం నేలమట్టం చేయబడ్డాయి ఏ ఇంట్లోనైతె ప్రధాన మంత్రి నిత్యం వేదపారాయణ ఈశ్వరారాధన చెస్తుండేవాడో ఆ ఇల్లే అవులను కోసే కసాయి శాలగా మారిపోయింది తర్వాత రాబోయే అనేక వందల సంవత్సరాల వరకు మన మాతృభూమి యొక్క ఒక పెద్ద భూభాగం పరాయి పాలనలో మ్రగ్గిపోయింది

రాజు యొక్క వైయక్తిక శీలం భ్రష్టమైంది కాని అతని జాతీయ శీలం శ్రేష్ఠమైంది రెండవ వైపు ప్రధానమంత్రి వ్యక్తిగత శీలం చాలా గొప్పది కాని జాతీయ శీలం అతనిలో లోపించింది ఈ విధంగా ఇరువురూ దేశ దౌర్భాగ్యానికి కారకులైనారు కాబట్టి వైయక్తిక జాతీయసౌశీల్యాలు రెండూ జాతీయ వైభవానికి చాలా అవసరం

# 25 నైతికబాధ్యత

బెంగాలు ప్రాంతానికి చెందిన ప్రసిద్ధ సమాజ సేవకుడు శ్రీ చిత్త రంజన్ దాస్‌ను గురించి ఒక కథ వుంది వారి తండ్రిగారు చాలా సహృదయులు వారిది సరళము నిష్కపటమైన స్వభావము కావటం వలన మిత్ర బృందం కూడ వారికి చాలా వుంది తన కుటుంబంలోవాళ్ళకంటే కష్టంలో వున్న మిత్రులను గురించి వారెక్కువగా ఆలోచిస్తుండేవారు ఈ విధమైన ఉదారస్వభావం కారణంగా వారికి చాలా అప్పులైనాయి వారి ఆదాయం తక్కువైనందువల్ల అప్పులు తీర్చటం సాధ్యం కాలేదు అప్పులిచ్చిన వాళ్ళు కాగితాలు పత్రాలైతే రాసుకున్నారు కాని వారి మంచితనం కారణంగా కోర్టుకు వెళ్ళి వారిపై వ్యాజ్యం నడపటానికి పూనుకోలేదు

తన తండ్రి దివాలా తెసారనే అపకీర్తి రావటం చిత్తరంజన్‌దాస్‌కు ఇష్టం లేదు వారు చాల స్వాభిమానం కలవారు తెలివికలవారు కష్టపడి చదువుకొని వారొక ఉత్తమ న్యాయవాదులై బాగా డబ్బు సంపాదించి తమ తండ్రిగారు చేసిన అప్పులన్నీ వడ్డీతోసహా తీర్చివేసారు చాలా అప్పులు గడువుదాట పోయినాయి చట్టరీత్యా చిత్తరంజన్‌గారి మీద అవి తీర్చాల్సిన బాధ్యత ఏమిలేదు కాని నైతిక బాధ్యత వుంది తండ్రి చెసిన అప్పును వడ్డీతొసహా తెర్చటం వారు తమ నైతిక కర్తవ్యంగా భావించారు అందుకే అవి తీర్చనిదే వారి మనస్సుకు శాంతి లభించ లేదు

మన స్వయం సేవక్ నడవడి కూడ ఈ విధంగానే నైతిక బాధ్యతను గుర్తించేదిగా నిజాయతీ కలదిగా వుండాలి

మన స్వయంసేవక్ కూడ సంఘటనా కౌశల్యం గల కార్యకర్త ఎట్టి విపరీత పరిస్థితుల్లోనైనా అతడు శాఖను నిలబెట్టి సమాజ సంఘటన చెస్తాడు ఉచితంగా కుర్చీలు బల్లలు మోసు జంపకానాలు పరిచే హమాలీ కాదతడు

## 27 పాణిని, వ్యాఘ్రం

సంఘ కార్యం చేసేటప్పుడు హిందూ సమాజం హిందూ సంఘటన అని చెప్పగానే హిందూ శబ్దం యొక్క ఉత్పత్తి ఎలా జరిగిందని కొందరు పండితులు చర్చ ప్రారంభిస్తారు హిందూ సంస్కృతి ధర్మం ప్రపంచంలో శ్రేష్ఠమైనవైతే వాటిని గ్రహించె హిందూ సమాజం శక్తి సంపన్నం సంఘటితమై వుండాలనే వ్యవహారికపుటాలోచనను మాత్రమే సంఘం స్వీకరించింది

ఒకసారి గొప్ప వ్యాకరణ పండితు లొకరు శిష్యులకు పాఠం చెబుతున్నారు శబ్దోత్పత్తిని గురించి చర్చ జరుగుతున్నది ఇంతలో ఒక వ్యాఘ్రం (పులి) ఆకలితో అటువైపు వచ్చింది మనుష్యుల వాసనను పసిగట్టి వాసన చూసుకుంటూ అది వస్తున్నది పండితులు వ్యాఘ్ర శబ్దం యొక్క ఉత్పత్తిని గురించి ఆలోచిస్తూ కూర్చున్నారు శిష్యులు చెట్టెక్కి కూర్చొని గురువునుకూడ ముందు చెట్టెక్కమని వ్యాఘ్ర శబ్దం యొక్క ఉత్పత్తిని తర్వాత తెలుసుకోవచ్చని అన్నారు కాని పండితునికి వాళ్ళ మాట మనసుకెక్కలేదు వ్యాఘ్రం తన ఆహారం కోసం భూమిని వాసన చూస్తూ వారి దగ్గరికే వచ్చింది దాన్ని చూసి ఆయన వ్యాజిఘ్రతి ఇతి వ్యాఘ్రః అంటే వాసన చూసుకుంటూ నడిచేది వ్యాఘ్రము అని దాని

కలిసి తమ మధురమైన శైలితో వారితో ఇలా అన్నారు నేషనల్ మెడికల్ కాలేజీకి దాని నుండి లభించిన సర్టిఫికేట్లకు ప్రభుత్వ గుర్తింపు లేక పోవటం వల్ల విద్యార్థులు చాలా అసంతృప్తిగా వున్నారు వాళ్ళు ఆందోళన ప్రారంభించి అనేక స్థానాల్లో సభలు జరిపి ప్రజల్లో ఉద్రేక వాతావరణం నిర్మాణం చేస్తారు క్రమంగా ఈ ఆందోళన తీవ్రరూపం దాలుస్తుంది దీనికి సంబంధించిన వార్తలను దయచేసి మీరు మీ వార్తాపత్రికలో ప్రచురించండి

మంచిది! మీరు జరిపే సభల యొక్క స్థానం అధ్యక్షుడు వక్త మొదలైన సమాచారం అంతా మాకు తెలియజేయండి మేం మా పత్రికలో ప్రచురిస్తాం అని మోతీలాల్‌జీ పూజ్య డాక్టర్‌జీకి హామీ ఇచ్చారు

మీరేం కష్టపడకుండా సమాచారం అంతా మేమే స్వయంగా తెచ్చి మీకిస్తాం అని కూడా డాక్టర్‌జి ఘోష్ బాబుతో చెప్పారు

తర్వాత పూజ్య డాక్టర్‌జీ బెంగాల్లో అప్పటి ప్రముఖ నాయకుడు కలకత్తా విశ్వవిద్యాలయం ఉపాధ్యక్షుడునైన అశుతోష్ ముఖర్జీ వద్దకు వెళ్ళి వారితో ఈ విషయం గురించి వివరంగా చర్చించారు ప్రభుత్వ గుర్తింపు అవసరం అనే విషయం అశుతోష్ బాబు ఒప్పుకున్నారు విద్యార్థులే ఈ విషయం పట్టించుకొని ఆందోళన ప్రారంభిస్తే ప్రజల్లో కూడ చైతన్యం వస్తె గవర్నంను కలిసి ఏదైనా చెయటానికి వీలుంటుం దనికూడ అశుతోష్ బాబు డాక్టర్‌జీతో అన్నారు డాక్టర్‌జీ వారికి తమ మనస్సులో విషయం తెలియజేసి విద్యార్థులు ఆందోళన ప్రారంభిస్తారు దాని సమాచారం వార్తాపత్రికల్లో వస్తుంది వాటి కత్తిరింపులు తీసి మేం మీ దగ్గరకు పంపుతాం అవి తీసుకొని మీరు ముందు కార్యం గురించి ఆలోచించండి అన్నారు

గవర్నరు వెంటనే అంగీకరించాడు నేషనల్ మెడికల్ కాలెజీకి దాని సర్టిఫికేట్లకు ప్రభుత్వ మాన్యత లభించింది

## 29 మేమంతా స్వయంసేవకులం

సంఘం అస్పృశ్యత గురించి చెప్పింది చాల తక్కువే కాని అందరితో సమానత్వం స్నేహపూర్ణ వ్యవహారం ప్రత్యక్ష ఆచరణలో ఎక్కువగా చూపింది కొద్ది సంవత్సరాలకు పూర్వం వార్ధాలో మన శిశిర శిబిరం జరిగింది దానికి సమీపంలో అప్పుడు మహాత్మా గాంధీజీ ఆశ్రమం వుండేది ఒక రోజు రాత్రి 10 గంటలకు మహాత్మాజీ సంఘ శిబిరం చూడాలనుకున్నారు మన అధికారులు వెళ్ళి వారిని ఆహ్వానించి తీసుకొని వచ్చారు మహాత్మాజీ సంఘ అధికారులకు ఈ క్రింది విధంగా సంభాషణ జరిగింది

మహాత్మాజి మీ శిబిరంలో హరిజనులు ఎంతమంది వున్నారు?

సంఘ హరిజన బ్రాహ్మణ పేర్లతో మేం ఒకరి నొకరం గుర్తించుకోం

మహా ఐతే శిబిరంలో అందరు ఎవరు?

సంఘ వీళ్ళంతా హిందువులని మాత్రమే మాకు తెలుసు

మహా వీరిలో హరిజన బంధువు లెంతమంది వున్నారో నేను తెలుసుకోవాలనుకుంటున్నాను

సంఘ ఈ ప్రశ్న మేమైతే వాళ్ళను అడగలేము కావాలంటే మీరు అడిగి తెల్సుకోండి

విశ్వకవి శ్రేష్ఠతత్వ జ్ఞానియైన శ్రీ రవీంద్రనాధ టాగూరు ఒక పర్యాయం జపానులోని ఒక విశ్వ విద్యాలయానికి భారతీయ తత్త్వజ్ఞానం మీద ఉపన్యాసం ఇవ్వడానికి వెళ్ళారు ఆ విశ్వ విద్యాలయాధికారులు వారిని స్వయంగా ఆహ్వానించి ఆ కార్యక్రమం ఏర్పాటు చేసారు కాని నిశ్చిత సమయం దాటిపోతున్నా కార్యక్రమం ఏర్పాటు చేసిన కార కర్తలు కొందరు తప్ప వారి ఉపన్యాసం వినటానికి శ్రోత లెవరూ రాలేదు ఆ విశ్వవిద్యాలయానికి నాల్గువైపుల విద్యార్థుల వసతి గృహాలు కూడా వున్నాయి వాటిల్లో చాలామంది ఉన్నత విద్యాభ్యాసం చేసే విద్యార్థులు కూడా వున్నారు కాని వాళ్ళెవరూ ఈ కార్యక్రమానికి రాలేదు ప్రపంచ ప్రసిద్ధి చెందిన ఇంత శ్రేష్ఠకవి తత్వజ్ఞాని ఇచ్చే ఉపన్యాసం వినటానికి అధిక సంఖ్యలో విద్యావంతులందరు ఎందుకు రాలేదని అక్కడి అధికారులకు చాల ఆశ్చర్యం వేసింది విచారం కూడ కల్గింది మీరెందుకు రాలేదని తర్వాత అక్కడి విద్యార్థులనడిగితే We are not going to listen the philosophy of a defeated nation (ఒక బానిస జాతియొక్క తత్వజ్ఞానం వినటానికి మేం సిద్ధంగా లేం అలాంటి సమాజం యొక్క ప్రతినిధి ఏమి చెప్పినా వినటం మా కిష్టంలేదు) అని వాళ్ళు సమాధానం ఇచ్చారట

## 31 మంచివాళ్ళకి దొంగబుద్ధి పుట్టకుండా ఉండటానికే ఈ తాళం

మన హిందు సమాజం యొక్క బలహీనతయే మనమీద ఆక్రమణ చేయటానికి ఇతరులకు ప్రోత్సాహం ఇస్తున్నది మన జాతీయ జీవనం సుఖ సమృద్ధంగా వుండాలంటే మనం సంఘటితంగా వుండటం అవసరం ఇతరులు ఆక్రమణ చేసినా చేయకపోయినా వాళ్ళలో దురాక్రమణ

# 32 సర్వం బ్రహ్మమయం

మన మహాపురుషులు కేవలం పెద్ద పెద్ద ఆధ్యాత్మిక విషయాల మాట్లాడేవాళ్ళు మాత్రమేకారు తమ ప్రత్యక్ష ఆచరణద్వారా సమాజం ముందు చక్కని ఆదర్శంకూడ వాళ్ల నిలబెట్టారు అందరిలో భగవంతుడే విరాజిల్లుతున్నాడన్న విషయంకూడ ప్రత్యక్ష ఆచరణలో నిరూఎతమైంది

ఎవరైనా బీద భిక్షకుడు ఎవరి ఇంటిముందుకైనా వస్తే ఆ ఇంటి యజమాని అతనికి భోజనం పెట్టి వినయంతో నమస్కరించి పంపేవాడు ఆ సమయంలో దాత నిరహంకారుడై స్వయంగా పరమేశ్వరుడే అతిథి రూపంలో తన ఇంటికి వచ్చాడని భావించేవాడు

మహారాష్ట్ర ప్రాంతానికి చెందిన ఒక భక్తుడు శ్రీ ఏకనాథ్‌జీ ప్రయాగ నుండి గంగాజలం కావడిలో పెట్టుకొని పాదచారులై రామేశ్వరంలో శివుడికి అభిషేకం చేయటానికి వెళుతున్నారు మార్గమధ్యంలో ఎక్కడా నీటిబొట్టు దొరకని ఎడారి ప్రాంతం కొంత వారు దాటాల్సి వచ్చింది అక్కడ ఒక గాడిద నీళ్ళులేక దాహంతో అల్లాడుతూ వారికి కనిపించింది చాలా దూరందాక ఎక్కడా వారికి నీటిజాడ కన్పించలేదు ఏకనాథ్‌జీ హృదయం ద్రవించి ఎంతోదూరం నుంచి అతి ప్రయాసతో మోసు తెస్తున్న గంగాజలాన్ని ఆ గాడిదకు త్రాగించారు ఏకనాథ్‌జీ వెంటవున్న శిష్యులు అదిచూసి ఆశ్చర్యచకితులై రామేశ్వరంలో అభిషేకించాల్సిన గంగాజలాన్ని ఈ హీన జంతువుకు ఎందుకు త్రాగించారు? మీకు లభించే పుణ్యం అంతా పోతుందికదా? అని అడిగారు

ఏకనాథ్‌జీ రామేశ్వరంలోని శివలింగంలో నివసించే బ్రహ్మయే ఈ గాడిద అంతఃకరణంలో కూడ వుంది అని సమాధానం ఇచ్చారు తర్వాత వారు రామేశ్వరం వెళ్ళలేదు

అందరిలో భగవంతు డున్నాడనే నిజమైన అనుభూతి ఇదే వివేకంతో ఈ హిందూ సమాజంయొక్క ప్రత్యేకతలను దృష్టిలో వుంచుకొని వాటిని ఆచరణలో పెట్టటానికి ప్రయత్నం చేయటం అవసరం

## 33 వయం పంచాధికం శతం

మహాభారతంలో ఘోషయాత్ర సంగతి అందరికీ తెలుసు పాండవులు అరణ్యావాసం చేస్తున్నారు అటుఇటు తిరుగుతూ వాళ్ళు ద్వైతవనంలోకి వచ్చారు దుర్యోధనుడికావిషయం తెలిసి శకుని కర్ణుడు మొదలైన వాళ్ళతో ఒక దురాలోచన చేసాడు పాండవులను అవమానపరచే ఉద్దేశ్యంతో అతడు తన సైన్యపరివార సమేతుడై ద్వైతవనంలో పాండవులున్న చోటికి వెళ్ళాలని నిశ్చయించాడు గుర్రాలు ఏనుగులు రథాలు అన్నీ సిద్ధం చేసుకొని రత్నాలంకారభూషితులై అందరూ ద్వైతవనంలో వున్న సరోవరం దగ్గరికి వెళ్ళారు కొందరు సేవకులు ముందుకు వెళ్ళి చూడగా అక్కడ గంధర్వ రాజైన చిత్రసేనుడు తన పరివారంతో విడిది దిగి వున్నాడు అతడు దుర్యోధనుని దురుద్దేశం తెలుసుకొని వాళ్ళతో యుద్ధం చేసి దుర్యోధనుని పరివారం అంతటిని ఓడించి వేసాడు ఏడుస్తూ మొత్తుకుంటూ కొందరు సైనికులు పాండవుల వద్దకు పరుగెత్తుకుంటూ వెళ్ళి జరిగిన సంగతి చెప్పి దుర్యోధనాదులను రక్షించమని ప్రార్థించారు అది విని భీమసేనుడు సంతోషంతో చప్పట్లు కొడుతూ మంచిదైంది మమ్మలను అవమానించటానికి వచ్చి వాళ్ళే అవమానం పాలైనాడు

చేసిన కర్మకు ఫలితం అనుభవిస్తున్నారు కాగల కార్యం గంధర్వులే తీర్చారు మనం కౌరవుల సహాయానికి వెళ్ళవద్దు అన్నాడు

అప్పుడు ధర్మరాజు ఆ విధంగా మాట్లాడవద్దని భీముని వారిస్తూ మనతో ఎలా ప్రవర్తించినా వాళ్ళూ మనమూ సోదరులమే పరస్పరం మనకెన్ని అభిప్రాయ భేదాలున్నా ఇతరులతో కలహం వచ్చినప్పుడు మనమంతా ఒకటిగానే వుండాలి మన ఇరువురి మధ్య కలహం వస్తే వాళ్ళు నూరుగురు మనం ఐదుగురం కాని ఎవరైనా బైటి శత్రువు వచ్చి నప్పుడు మనం నూట ఐదుగురం వయం పంచాధికం శతం అని హిత బోధ చేసాడు

ధర్మరాజు యొక్క వాక్యం సంఘకార్య పద్ధతికి పునాదిరాయి వంటిది మన సంస్థలో ఎన్ని మత భేదాలున్నా మన కార్య పద్ధతులు వేరుగా వున్నా అప్పుడప్పుడు మన మధ్య శత్రుత్వం కూడా ఏర్పడుతున్నా బైట శత్రువు మన మీదికి వచ్చినప్పుడు లేక ఏదైనా జాతీయ విపత్తు ఏర్పడినప్పుడు జాతీయ శ్రేయస్సుకు అవసరమైనప్పుడు మనం అంతా ఒకటి కావాలి మనం అంతా భుజం భుజం కలిపి శత్రువును ఎదుర్కో వాలి వయం పంచాధికం శతం అన్నదే మన కార్య సూత్రంగా వుండాలి

## 34 ఐతే, ప్రచారకులే కండి

అవి సంఘం ప్రారంభపు రోజులు బహుశా 1928 30 సంవత్స రాల్లో సంగతి ఆ రోజుల్లో అడవి సత్యాగ్రహం జండా సత్యాగ్రహం మొదలైన శాసనోల్లంఘన కార్యక్రమాలు చేపట్టి ఆందోళన చెయాలనే ఉత్సాహం యువకుల్లో బాగా వుండేది న్యాయవాదులైన కొందరు యువ

స్వయంసేవకులు డాక్టర్జీ వద్దకు వచ్చి 'స్వరాజ్య సంపాదన కోసం మేం సత్యాగ్రహం చేస్తాం' అన్నారు మీ ఆలోచన బాగుంది చాలా సంతోషమే కాని సత్యాగ్రహం యొక్క ప్రమాణాలు ఎలా వుంటాయో ఆలోచించారా? అని డాక్టర్జీ వాళ్ళనడిగారు మేం న్యాయవాదులం అన్ని సంగతులూ మాకు తెల్సు ఒకటి రెండు సంవత్సరాలు జైలుశిక్ష పడుతుంది మేం దానికి సిద్ధమే అని వాళ్ళు సమాధానం ఇచ్చారు

జైల్లో రెండు సంవత్సరాలుండాలి రెండువేలు జుల్మానా కూడా చెల్లించాలి అప్పుడు మీ ఇల్లు కుటుంబం ఎలా గడుస్తాయి? మీ వృత్తి వుద్యోగాల సంగతేమిటి? అని డాక్టర్జీ మళ్ళీ అడిగారు

మేం అన్ని ఏర్పాట్లు చెసాం అంతా ఆలోచించే వచ్చాం దాని విచారం మీకక్కరలేదు అని వాళ్ళు సమాధానం ఇచ్చారు

అప్పుడు డాక్టర్జీ వాళ్ళతో రెండు సంవత్సరాలు మీరు ఇల్లు విడిచిపెట్టి వుండగలరు రెండువేలు రూపాయలు కూడ ఖర్చు చెయగలరు ఐతే ఒకపని చేయండి సమాజంలో దేశభక్తిని నింపే సంఘకార్యం మహత్త్వపూర్ణమైంది కదా? దానికోసం రెండు సంవత్సరాలు ఇంటికి దూరంగా వుండి వృత్తి ఉద్యోగాలకు శలవుపెటి ప్రచారకులుగా రండి డబ్బు ఖర్చు చేయాల్సిన అవసరంకూడ లేదు అవసరమైతే మీకు డబ్బు ఏర్పాటు నేనే చెస్తాను సంఘశాఖలు పెంచి ఉత్తమ స్వయం సేవకులను నిర్మాణంచేసె నిర్మాణాత్మక కార్యం చేయండి అని అన్నారు

మేం ఆలోచించుకొని వచ్చి చెబుతాం అని సమాధానం ఇచ్చి ఆ యువ న్యాయవాదులు అక్కడినించి వెళ్ళిపోయారు మళ్ళీ ఎప్పుడూ సత్యాగ్రహం చేస్తాం అన్న మాట వాళ్ళ నోటినుండి రాలేదు

ప్రతియొక్క స్వయంసేవకుడ్ని డాక్టర్జీ చాల సూక్ష్మంగా పరిశీలించేవారు ఆ వచ్చిన న్యాయవాదులు సత్యాగ్రహం అంటే జయజయకారాలు స్వాగత సత్కారాలు మొదలైనవి వుంటాయని అనుకొని వచ్చారని వారికి తెలిసిపోయింది జైల్లో వున్నా సంఘకార్యం వంటి నిర్మాణాత్మక కార్యం చేయాలని వాళ్ళకు లేదు

పూజ్య డాక్టర్జీ జైల్లో వుంటూ కూడ సంఘకార్యం స్వయంగా చేసి చూపారు సత్యాగ్రహం చేసి జైలుకు వెళ్ళినప్పుడు అక్కడ విదర్భ ప్రాంతానికి చెందిన పెద్ద పెద్ద రాజకీయ కార్యకర్తలతో పరిచయం పెంచుకొని వాళ్ళకు సంఘకార్యం యొక్క విశిష్టతను తెలియజేసి జైలు నుండి విడుదలై వచ్చిన తర్వాత ఆ రాజకీయ కార్యకర్తల నేతృత్వంలోనే వారు సంఘశాఖలు నిర్మించారు 1930 32 తర్వాత విదర్భ ప్రాంతంలో ఈ విధంగానే సంఘకార్యం ప్రారంభమైంది

## 35 సైనికునికి చెంపదెబ్బ

భారతీయులు దుర్బలులు ఆంగ్లేయులు బలవంతులు అనుకోవటం పొరబాటు బలహీనత కారణంగానే మనం పరాజయం పొందామనటం కూడ సరికాదు కొద్దీ గొప్ప బలహీనుడైనా సత్యాన్ని ధైర్యంతో చెప్పినట్లయితే లోకం దాన్ని ఒప్పుకుంటుంది ఇంగ్లీషువాళ్ళను చూసి మనం వాళ్ళకంటే తక్కువవాళ్ళం అని అనుకోరాదు నా స్వంత అనుభవమే ఒకటి వుంది

నా మిత్రుడితో కలిసి ఒకసారి నేను షికారు వెళ్ళాను తిరిగి వచ్చేటప్పుడు ఒక సినిమాహాలు దగ్గర జనం పోగైవున్నారు సినిమా ఐతే విడిచిపెట్టారు పురుషులందరు బైట స్త్రీలందరు లోపల వున్నారు

ఇద్దరు ఆంగ్ల సైనికులు తాగివచ్చి స్త్రీల ప్రవేశద్వారం వద్ద నిలుచున్నారు వాళ్ళ నక్కడినుండి తొలగించటానికి పోలీసులకు ధైర్యం చాలటం లేదు మేనేజరు కూడ వాళ్ళనుచూసి భయపడుతున్నాడు ఇక ప్రజల ధైర్యం గురించి చెప్పేదేముంది? వాళ్ళు ఆంగ్లేయులే కాక సైనికులు కూడ

నేను నాకు తెలిసిన మిత్రుడొకడు అక్కడ కనపడగా ఇక్కడెందుకు నిలుచున్నావని అడిగాను నా భార్య సినిమాహాల్లో ఉందని ఆమె కోసమే నిలుచున్నానని అత డన్నాడు ఇంత మంది వుండి కూడ ఎవరికీ ఆ సైనికులను అక్కడి నుంచి తొలగించే ధైర్యం చాలటం లేదు పద మనమే ఏదైనా చెద్దాం అని నా మిత్రుడితో నేనన్నాను మనకు కానిదానికి ఈ చిక్కుల్లో ఎందుకు పడాలని చెప్పి అతడు తప్పుకున్నాడు నేనొక్కడినే ఆ ఆంగ్ల సైనికుల దగ్గరకు వెళ్ళి అక్కడి నుంచి వెళ్ళిపొమ్మని వాళ్ళతో ఇంగ్లీషులో చెప్పాను వాళ్ళు వినిపించుకోలేదు ఇది స్త్రీల ప్రవేశద్వారం మీ రిక్కడి నుంచి వెళ్ళిపోండి అని మళ్ళీ ఒకసారి వాళ్ళతో అన్నాను ఐనా వాళ్ళు నా మాట ఏమాత్రం చెవిని పెట్టలేదు నేనొక సైనికుని చొక్కా కాలరు పట్టుకొని రెండు చెంప దెబ్బలు వేసాను వాడి త్రాగుడు మత్తు వదిలిపోయింది తెలివి వచ్చిన తర్వాత వాళ్ళక్కడనుంచి వెళ్ళిపోయారు

నావంటి సామాన్య వ్యక్తి కూడా ఆ ఇద్దరు సైనికులను దారికి తేగల్గినప్పుడు మనదేశీయులు శారీరకంగా బలహీనులని చెప్పడం సరికాదు

## 36 సత్యనిష్ఠయేకాక సంఘటనకూడ కావాలి

మౌలానా మహమ్మదలీగారిని మహాత్మాగాంధీగారి కుడిభుజం అనుకునేవాళ్ళు వారు చాలా అనుభవజ్ఞులే కాక చాలా దేశం తిరిగిన

వారు తెలివి కలవాడు కూడా జాతీయ భావాలు గల ముస్లిం అని ప్రజలు వారిని గురించి అనుకునేవారు ఖురానుకు వారు ఇంగ్లీషు అను వాదం చేసారు మహ్మదలీ గారికి మిత్రుడైన ఒక ఆంగ్ల పండితుడు దాన్ని చదివి అందుతో విజ్ఞాన శాస్త్ర విరుద్ధంగావున్న కొన్ని విషయాలు చూసి ఇందులో విజ్ఞాన శాస్త్ర విరుద్ధ విషయాలు కొన్ని కనబడు తున్నాయి స్త్రీ తన మొదటి భర్త నుండి విడాకులు పొందిన తర్వాత కూడా రెండు సంవత్సరాల వరకు ఆమెకు కల్గిన సంతానం మొదటి భర్త సంతానంగానే భావించబడుతుందని ఖురానులో వుంది ఇది విజ్ఞాన శాస్త్రం దృష్టితో సరియైందనిపించటం లేదు అని అడిగారు

మౌలానా గారు మిత్రమా! మనం సామాన్య మానవులం మన బుద్ధి పరిమితమైంది ఖురాను నిర్మాత యొక్క జ్ఞానం అపరిమితమైంది వారు తమ ఉన్నత బుద్ధితో ఆలోచించి వ్రాసింది నిజమేయై వుంటుంది అర్థవంతమైన వారి మాటలను అర్థం చేసుకొనే యోగ్యత మనకే లేక పోవచ్చును అని సమాధానం ఇచ్చారు

విజ్ఞాన శాస్త్ర విరుద్ధమైన విషయాల మీద కూడా వాళ్ళకున్న నిష్ఠ కారణంగా వాళ్ళు సంఘటితులై మన జాతీయ జీవనంలో అనేక సమస్య లకు కారణం అవుతున్నారు

మన సంస్కృతిలో విజ్ఞాన శాస్త్ర విరుద్ధ విషయం ఒక్కటికూడా లేదు స్వయంగా శ్రీ శంకరాచార్యుల వారే నిప్పు చల్లగా వుందని వేదం చెప్పినా నేను దాన్ని అంగీకరించను ఎందుకంటే అది నా అనుభవానికి విరుద్ధం అన్నారు కాబట్టి సత్యం మీద విశ్వాసం వున్నవాళ్ళు కూడ సంఘటితం కావటం ఆత్మవిశ్వాసం కల్గివుండటం అవసరం అప్పుడే వాళ్ళు సుఖ సమృద్ధులతో కూడిన వైభవోపేతమైన జాతీయ జీవనాన్ని నిర్మాణం చేయగలరు

# 37 అబద్ధం అనేకసార్లు చెబితే సజ్జనుడు కూడ భ్రమలో పడతాడు

మన దేశంలో కమ్యూనల్ అనే పదం యొక్క ప్రయోగం ఆంగ్లేయులు చాల ఆలోచించి చెసారు వాళ్ళు హిందూదేశంలో హిందువుల పనినే కమ్యూనల్ అన్నారు ఈ పద ప్రయోగం అనేకసార్లు చేయటంవల్ల కొందరు అమాయకులు మనలను మంచసే హిందూ సంఘట సు కమ్యూనల్ అనుకుంటున్నారు కమ్యూనల్ పని చేయటం అనుచితం ని అందువల్ల పరిహరించదగినది అనే భావం కూడ ఆంగ్లేయుల కుతంత్రం వల్లనే ఇక్కడ ఏర్పడింది మరీ మరీ దాన్ని ప్రచారం చయటంవల్ల దాని కొక ఫిథమైన గౌరవం కూడ ఏర్పడింది అందువల్లనే ఎంతో మంది సంఘ కార్యం స్వీకరించటానికి అనుమానిస్తున్నారు

అబద్ధమైనా అనేక సార్లు చెబితే నిజమే అనిపిస్తుంది దీనికి సంబంధించినదే ఒక కథ వుంది అమాయక స్వభావం గల ఒక గ్రామీణ వ్యక్తి ఒక మేకపిల్లను తన భుజం మీద పెట్టుకొని తీసుకొని వెళ్ళుతున్నాడు ముగ్గురు దొంగలది చూసి ఆ మేకపిల్లను కాజేయాలనుకున్నారు అందులో ఒకడు ఆ గ్రామీణ వ్యక్తితో బాబూ! మీరీ కుక్కపిల్లను భుజం మీద పెట్టుకొని వెళ్ళుతున్నారెందుకండీ? అని అడిగాడు ఈ మాటతో అతని మనస్సు కాస్త చలించింది కొంత దూరం వెళ్ళిన తర్వాత మరొక దొంగ కనబడి అయ్యా! మీరింత సజ్జనులుగా కనబడుచున్నారు ఏమైనా మతి భ్రమించిందా ఈ అసహ్యకరమైన కుక్క పిల్లను భుజం మీద పెట్టుకొని వెళ్ళుతున్నారు? అని అడిగాడు తన భుజంమీదవున్నది తప్పకుండా ప్రజలకు కుక్క పిల్లవలె కనబడుతుండ వచ్చునని గ్రామీణ వ్యక్తి అనుకున్నాడు ఇంకా కొంత దూరం వెళ్ళిన తర్వాత ఇంకో

దొంగ కనబడి చాలా మర్యాదగా అతనికి నమస్కారం చేసి మహా శయా! ఇలాంటి చెడు బుద్ధి మీ బుర్రలో ఎలా ప్రవేశించింది? లోకం మీ గురించి ఏం అనుకుంటుందో? ఏం అనుకున్నా పరవాలేదు కుక్కపిల్ల మాత్రం చాలా బాగుంది అన్నాడు

ఆ గ్రామీణ వ్యక్తి కారణం ఏదైనాసరే కుక్కవలె కనబడే ఈ జంతువును మోసుకు పోవటం తనవంటి సజ్జనుడికి తగనిపని అనుకొని వెంటనే తన భుజం మీద వున్న మేకపిల్లను కింద వదిలేసి వెళ్ళి పోయాడు అవకాశం ఎదురు చూస్తున్న ముగ్గురు దొంగలు ఆ మేక పిల్లను చంకన బెట్టుకొని ఇంటికి వెళ్ళారు

మన జాతీయ జీవనం గురించి కూడ మన మనస్సుల్లో ఇలాంటి భ్రమనే కల్గించే ప్రయత్నం జరుగుతున్నది మహ్మదీయులు ఆంగ్లేయులు మన దేశానికి రాకముందు నుంచే ఇక్కడ జాతీయ జీవనం వుంది హిందూ సమాజం లేకపోతే అనాది కాలంనుంచీ వస్తున్న జాతీయ జీవనం నిలవ లేదు కాబట్టి హిందుత్వమే ఇక్కడి జాతీయత్వం అన్న విషయం మనం స్పష్టంగా తెలుసుకోవాలి

## 38 ప్రపంచం మననుండి ఏమి ఆశిస్తుంది?

ఈనాడు సంపూర్ణ విశ్వం హిందూ సమాజం అంటే కొన్ని విశిష్ట మైన లక్షణాలు కలిగివుండే సమాజం అని భావిస్తున్నది కాని మనం మాత్రం మన ప్రాచీన హిందూ సంస్కృతికి జీవన పద్ధతులకు దూరమై పాశ్చాత్య జీవన విధానాలను అనుకరిస్తున్నాము ఈ మధ్యనే వార్తాపత్రి కల్లో ప్రచురితమైన ఒక సంఘటనయే ఇందుకు చక్కని నిదర్శనం

జర్మనీలో సంస్కృత భాష సాహిత్యాలను గురించి అధ్యయనం చేసే సంస్థ ఒకటి వుంది ఆ సమయంలో ఇంగ్లాండులో వుంట్ను న చతుర్వేది అనే పేరుగల ఒక భారతీయ విద్వాంసుని ఉపన్యాసం ఇవ్వ టానికి ఆ సంస్థ ఆహ్వానించింది ఎందుకల్లనో తెలియదు కాని వాళ్ళు కొంచెం పొరపాటుపడ్డారు చతుర్వేది అన్న పేరు చూసి ఇతడు నాల్గువేదాల్లో పండితుడై వుంటాడని వాళ్ళనుకున్నారు నిర్ణీత కార్యక్రమం ప్రకారం ఆ చతుర్వేదిగారు విమానం ద్వారా జర్మనీ వచ్చారు వారికి స్వాగతం చెప్పటానికి ఆ సంస్థ యొక్క సభ్యులేకాక ఇంకా అక్కడి ప్రతిష్ఠిత వ్యక్తు లనేకమంది కూడ విమానాశ్రయానికి వచ్చారు విమానం నుండి దిగిన చతుర్వేది గారిని చూసి అంతా ఆశ్చర్యం చెందారు ఎందు కంటే వారు నఖ శిఖ పర్యంతం పాశ్చాత్య వేషభాషల్లో వున్నారు భారతీయత ఎక్కడా మచ్చుకైనా క పడటం లేదు యూరపులో చలి ఎక్కువ కాబట్టి వారలాంటి దుస్తులు వేసుకున్నారు కాబోలనుకొని కార్య కర్తలు వారికి ఘనంగానే స్వాగతం చెప్పారు సభామంటపం యొక్క నాల్గు ద్వారాలకు వాళ్ళు నాల్గువేదాల పేర్లు పెట్టారు ఆ సంస్థయొక్క మహిళా కార్యదర్శి స్వాగతోపన్యాసం సంస్కృతంలో చదివింది ఇతర పెద్దలు కూడ సంస్కృతంలోనే ఉపన్యసించారు ఆఖరుకు చతుర్వేదిగారి వంతు వచ్చింది వా రాంగ్లభాషలో తమ ఉపన్యాసం ప్రారంభించేసరికి అందరికీ మరింత ఆశ్చర్యం వేసింది వారి ఉపన్యాసానికి పూర్వ వక్తల ఉపన్యాసాలతో ఏ మాత్రం సంబంధం లేదు ఎందుకంటే చతుర్వేదిగారికి వాళ్ళు మాట్లాడింది ఒక్క అక్షరం కూడ అర్థం కాలేదు వారికామాత్రం సంస్కృత జ్ఞానం కూడా లేదు ఇది చూసిన తర్వాత వారు కేవలం నామ మాత్రపు చతుర్వేది అన్న సంగతి ఆ సంస్థ కార్యకర్తలకు తెలిసిపోయింది వాళ్ళు వెంటనే తర్వాత కార్యక్రమాలన్నీ రద్దుచేసి వారిని వెనక్కు పంపించారు ఈ విధంగా మనం ప్రపంచం యొక్క ఆశలను వమ్ము చేస్తున్నాం

## 39 ఒకటికంటె

ఒక వృద్ధుడు అన్నివిధాలా సుఖాలు కల్గివున్నాడు వ్యవసాయం డబ్బు అన్నీ అతనికున్నాయి అతనికి నల్గురు పుత్రులున్నారు వాళ్ళు చాలా తెలివికలవాళ్ళు కార్యసాధకులు కాని చిన్న చిన్న విషయాలకే వాళ్ళు పరస్పరం కలహించుకునేవాళ్ళు ఇదిచూసి తండ్రి చాలా బాధ పడుతుండేవాడు

ఒకరోజు అతడు వాళ్ళను సన్నటి కట్టెపుల్లలు కొన్ని తెమ్మని వాటన్నిటిని కట్టకట్టి కాస్త దీన్ని తుంపండి అని వాళ్ళతో అన్నాడు నల్గురు కొడుకులు వరుసగా ఒక్కొక్కరే దాన్ని తుంపటానికి చాల ప్రయత్నం చేసారు కాని తుంపలేకపోయారు అప్పుడు తండ్రి కట్టువిప్పి ఒక్కొక్క పుల్లను వెరుచేసి ఇచ్చి తుంపమన్నాడు రెండు నిముషాల్లోనే వాళ్ళా పుల్లలన్నిటినీ తుంపవేశారు

అప్పుడు ముసలి తండ్రి వాళ్ళతో చూడండి పిల్లలూ! కలిసివుంటే మిమ్మలను ఎవరూ నాశనం చేయలేరు పరస్పరం కలహించుకుంటే త్వరలోనే నాశనమైపోతారు అన్నాడు

ఈ చిన్నపిల్లల కథ పెద్దలకు కూడా చాలా బోధప్రదమైంది మనం ఒకవేళ భాష ప్రాంత కుల, మత సాంప్రదాయ భేదాలతో పరస్పరం కలహించుకుంటూ విఘటన తత్వాలను ప్రోత్సహిస్తుంటే మన సమాజం పతనంకాక తప్పదు మన దేశ ఔన్నత్యాన్ని మనం కోరినట్లయితే సంపూర్ణ దేశంలో ఏకాత్మ భావనను నిర్మాణం చేయాలి

# 40 నిజమైన దేశభక్తి

ఈ మధ్యనే పండిత నెహ్రూగారు అమెరికా నుండి తిరిగి వస్తూ లండనులో ఆగారు అక్కడి భారతీయులు వారికి వ్యతిరేకంగా నల్ల జెండాల ప్రదర్శన చేశారు పండిత నెహ్రూ ముర్దాబాద్ అనే నినాదాలు గూడ ఇచ్చారు అభిప్రాయ భేదాలుండవచ్చు కాని విదేశాల్లో మన ప్రధానికి వ్యతిరేక ప్రదర్శన చేయటం మంచిది కాదు

విదేశాలల్లో ఈ విధమైన ప్రవర్తన భారత్‌కు ద్రోహం చేయటమే అక్కడ పండిత నెహ్రూను అవమానించటమంటే భారతజాతిని భారత ప్రధానిని అవమానించటమన్నమాట పండిత నెహ్రూ కాంగ్రెస్ పార్టీ అధ్యక్షుడుగాకాక భారత ప్రధానిగా అక్కడికి వెళ్ళారు నేనైతే కాంగ్రెస్ లేక మరే రాజకీయ పక్షం యొక్క సభ్యుడిని కాదు ఇకముందు కాను కూడ రాజకీయం నా స్వభావం కాదు అయినప్పటికీ ఈ వార్త విని నేను చాలా బాధపడ్డాను ఎందుకంటే ఇది మన దేశానికి అవమానంగా నేను భావిస్తున్నాను

రాజకీయ పక్షాలన్నిటిలో ఈ విధమైన విద్వేషాలు నిర్మాణం కావటం మంచిది కాదు మనం విదేశీయులనుండి త్రాగుడు తినటంలాంటి దురభ్యాసాలు చాలా నేర్చుకున్నాం కాని వాళ్ళలో వున్న దేశభక్తి కొంచెం కూడ నేర్చుకోలేదు

ప్రతిపక్ష నాయకుడుగా వున్న ఇంగ్లాండు మాజీ ప్రధాని చర్చిల్ ఒకసారి అమెరికా వెళ్ళాడు తప్పకుండా అతడు తన ప్రభుత్వాన్ని తీవ్రంగా విమర్శిస్తాడనే ఉద్దేశంతో అక్కడి పత్రికా విలేఖరులాయన్ను

మీ ప్రభుత్వం యొక్క పరిపాలన ఎలా వుంది? అని అడిగారు దానికి చర్చిల్ ఈ విధంగా సమాధానమిచ్చాడు

నాకు మీ ఉద్దేశం తెలుసు కాని మర్చిపోకండి నేను ఇంగ్లాండ్‌లో ప్రతిపక్ష నాయకుడిని విదేశాల్లో మా ప్రభుత్వానికి సమర్థకుడిని (In England I am the leader of the opposition but abroad I am the supporter of His Majesty s government ) ఇదీ నిజమైన దేశభక్తి!

## 41 ఆత్మీయత

రామకృష్ణ పరమహంస దక్షిణేశ్వరంలో ఉండేవారు ఆయన దగ్గరకు అనేకమంది సాధు సన్యాసులు వస్తుండేవారు ఒకరోజున ఒక పిచ్చి వాడు అక్కడకు వచ్చాడు శరీరం కృశించి ఉంది స్నానంచేసి ఎన్ని రోజులైందో శరీరం దుమ్ముకొట్టుకొని ఉంది జుట్టు చిందరవందరగా ఉంది అతడు రాగానే రామకృష్ణ పరమహంస లేచి నిలుచొని ఆదరంతో పలకరించాడు ఒకరినొకరు చూస్తూ నిలుచుండిపోయారు కొద్దిసేపు అట్లా ఉన్నాక పిచ్చివాయన నవ్వుతూ వెళ్ళిపోయాడు

అక్కడే ఉన్న శిష్యులకిది అర్థం కాలేదు మహాత్మా! వాడెవడో పిచ్చివాడు వస్తే మీరు లేచి నిలబడి మర్యాదలు చేయడమేమిటి? అని అడిగారు వారి అమాయకత్వానికి నవ్వుతూ పరమహంస ఆయన పిచ్చి వాడుకాదు, బ్రహ్మజ్ఞాని ఒక్కొక్కసారి అటువంటి వారు సామాన్యులకు పిచ్చివారివలె కనుపిస్తారు కాని వారు మహానుభావులు! అన్నారు

ఇది వినగానే శిష్యులలో ఒకరికి ఆయనను పట్టుకొని ఆయన ద్వారా భగవంతుని దర్శించవచ్చు అనే ఆలోచన కలిగింది వెంటనే ఆయన వెంట పోసాగాడు అది తెలుసుకొన్న జ్ఞాని పరుగెత్తసాగాడు భక్తుడు కూడా పరుగెత్తసాగాడు కొంత దూరం పోయాక ఆయన ఆగి అక్కడ ఉన్న రాతిని తీసుకొని భకుని కొట్టబోయాడు భక్తుడు దూరం నుంచి మహాత్మా! కొట్టకండి నన్ను కనికరించండి భగవంతుని దర్శన భాగ్యం కలిగించండి అంటూ ప్రార్థించాడు

ఇది వినగానే ఆయన పెద్దగా నవ్వాడు చూడు నాయనా! ఇక్కడి కాలవలో ఉన్న మురికి నీరు పవిత్ర గంగాజలం రెండూ నీకు ఒకే విధంగా భాసించిన రోజున నా దగ్గరకు రా భగవత్ సాక్షాత్కారం కలుగుతుంది అని చెప్పి ఎటో వెళ్ళిపోయాడు

మనస్సులో అల్పభావాలు ఉన్నంతకాలం భగవంతుని చేరడమనేది అసంభవం మన సమాజం భగవంతుని యొక్క సృష్టి రూపం దానిని మనం ఆ విధంగా చూడగలగాలి ఎవ్వరినీ తక్కువవారిగా భావించరాదు దూరంగా ఉంచరాదు అందువల్ల కొండల్లో కోనల్లో అడవుల్లో ఉండేవారంతా మన బంధువులే అనే భావతో మనం వ్యవహరించాలి

## 42 పొరుగువారిని ప్రేమించు

నేను ఒకసారి కొద్దిరోజులు బొంబాయిలో ఉన్నాను అది పెద్ద భవనం అనేక కుటుంబాలవారు అందులో నివసిస్తుండేవారు అన్ని వాటాలలోవుండేవారు నడవడానికి వీలుగా వరండా ఉంది నేను ఉంటున్న

వాటాకు రెండు వాటాలవతల కొత్తగా పెళ్ళి అయిన దంపతులు ఉంటున్నారు భర్త ఉద్యోగం కోసం బయటికి వెళ్ళేవాడు ఆమె ఇంటిపని చేసుకొంటూ వరండాలో అటుఇటు తిరుగుతుండేది నేను కేవలం స్నానం కోసం మాత్రమే ఇంటికి వస్తుండేవాడిని నేను ఒక రోజు ఇంటికి వచ్చేటప్పటికి ఆమె కనుపించలేదు వారి వాటా తలుపు మూసి ఉంది నేను వారిని గురించి నేను ఉంటున్న ఇంటి యజమానిని అడిగాను నాకు తెలియదు అన్నాడు అడిగి తెలుసుకోండి అన్నాను ఎనిమిది గంటలు దాటుతోంది పాలు కూరలు మొదలైన వాటికోసం అయినా వారు బయటకు రావాలి కదా! ఎందుకు రాలేదు? ' అంటూ అనుమానాన్ని వెల్లడించాను అది విని ఆయన ఎందుకండీ అనవసరమైన విషయాల్లో తల దూర్చుతారు? వాళ్ళ సంగతేదో వాళ్ళకు తెలుసు అంటూ చిరాకు ప్రదర్శించాడు

దీనిని ఇతరుల విషయాలలో తలదూర్చటమనరు అది ఇరుగు పొరుగు వారిపట్ల ఉండే కర్తవ్యము ' అన్నాను అయన బొంబాయిలో మా జీవన విధానంలో ఒక పంతస్తు ఉంది దాని ప్రకారం ఇతరుల విషయంలో జోక్యం కలిగించుకోరాదు అని సమాధానం చెప్పాడు

నేను వారి ఇంటికి వెళ్ళాను తలుపు తట్టాను ఎవ్వరూ పలకలేదు మెల్లగా తలుపు నెట్టాను తలుపు తెరుచుకుంది లోపలి దృశ్యం నన్ను నిశ్చేష్టుని చేసింది ఆ ఇంటలోని యువకుడు కొద్దిరోజులుగా అనారోగ్యంతో బాధపడుతున్నాడు ఆ రాత్రే హఠాత్తుగా మరణించాడు అతని భార్య ఏడుస్తూ శవం ప్రక్కనే కూర్చొని ఉంది నేను ఆమెను సమీపించి వారి బంధువులను గురించి వివరాలు తెలుసుకొన్నాను వారందరికి వార్త పంపించి వారు రాగానే తిరిగి నా పనిలో నిమగ్నుడనయ్యాను

ఇది నేటి సమాజ పరిస్థితి పొరుగువారిపట్ల ఆత్మీయత లేదు అట్లా లేకుండా ఉండడం ఉన్నత జీవన ప్రమాణానికి కొలబద్దగా భావిస్తు న్నాము ఈ పరిస్థితి మారిపోవాలి ఆత్మీయతా భావనను సమాజంలో నిర్మించడమే గొప్ప సమాజ సేవ ఈ భావం కొఱవడిన కారణంగానే మనం వికలాంగుల కోసం నిరక్షరాస్యుల కోసం నిర్భాగ్యుల కోసం వేర్వేరు పథకాలను రూపొందించవలసివస్తోంది

## 43 పరబ్రహ్మ స్వరూపం

నా స్నేహితులలో ఒక గొప్ప పండితుడున్నాడు ఆయన నన్ను గురించి ఆలోచిస్తుండేవాడు సంఘం పనికోసం నేను దేశమంతా తిరుగు తుండేవాడను సంఘటనా కార్యానికి ఏకాత్మ భావన అవసరం దానికి అద్వైతమే తగినదని ఆయన అభిప్రాయం ఒకరోజు ఆయన మీకు అద్వైత సంద్ధాంతం తెలుసునా? అంటూ ప్రశ్నించాడు నాకా పేరే తెలియదు అన్నాను శంకరాచార్యులు ఏమి చెప్పారో తెలుసునా? శంకరాచార్యులా! ఆయనెవరు? తిరిగి నేను ప్రశ్నించాను మీరు ఆయన రచనలను తప్పక చదవాలి లేనట్లయితే సంఘ కార్యాన్ని సరిగా చేయలేరు అంటూ చెప్పారు నాకు చదివే తీరిక ఎక్కడ? ఎప్పుడూ అటు ఇటు తిరుగుతుండేవాడను అన్నాను మీకు కొద్ది రోజులలోనే అదంతా నేర్పుతాను అని హామీ ఇచ్చాడు తరవాత కొంతసేపు అస్ప ష్టంగా తికమకగా ఏదో వేదాంతం చెప్పాడు నీవు బ్రహ్మ నేను బ్రహ్మ అతడు బ్రహ్మ అని చెప్పి ఊరుకొన్నాడు

తరవాత కొన్నిరోజులకు ఆయనతోబాటు ఒక పెద్దసభలో పాల్గొనే అవకాశం లభించింది ఆ సభా నిర్వాహకులు మమ్మల్ని ఎంతగానో

ఎక్కడ సాధు సంతులున్నారన్నా వారి వద్దకు వెళ్ళి స్వామీ! మీరు భగవంతుని చూసారా? అని నమ్రతతో అడిగేవాడు అందుకు వారు నాయనా! మేము ఆ ప్రయత్నంలోనే ఉన్నాము భగవంతుని చూడయుండలేదు అని చెప్పేవారు నిరాశతో తిరిగి వచ్చేవాడు ఇట్లా ఎన్నిసార్లు జరిగిందో లెక్కలేదు క్రమంగా భగవంతుని గురించి అందరు చెప్పే మాటలు బూటకం అనిపించసాగింది నిరీశ్వరవాదిగా మారి పోసాగాడు ఆయన చదువుతున్న కాలేజీలో ఒక ఇంగ్లీషు ప్రొఫెసరు ఉన్నాడు ఆయన నరేంద్రా! నీ సందేహాలు తీర్చగల వ్యక్తి ఒకడే ఉన్నాడు రామకృష్ణ పరమహంస దక్షిణేశ్వరంలో ఉంటాడు చూడ టానికి పిచ్చివాడివలె ఉంటాడు ఆయన దగ్గరకు వెళ్ళు అంటూ సలహా ఇచ్చాడు

కుతూహలం కొద్ది నరేంద్రుడు అక్కడికి వెళ్ళాడు ఏమి అవు తుందనే నమ్మకం లేదు అక్కడికి వెళ్ళేటప్పటికి ఒక పంచ చుట్టుకొని సంస్కార విహీనంగా కనుపిస్తున్న వ్యక్తి గ్రామీణ భాషలో మాట్లాడు తున్నాడు 'ఏమిటి ఇతని వద్దకు పంపించాడు ప్రొఫెసర్! అంటూ ఆశ్చర్యపోయాడు పరమహంస ప్రసంగం పూర్తిచేసిన తరువాత నరేంద్రుడు ఆయనతో నాదొక సందేహం తాము భగవంతుని ఎప్పు డైనా చూసారా? అన్నాడు

సూటిగా అడిగిన ప్రశ్నకు ఆయన సూటిగానే సమాధానం చెప్పాడు ఆ చూసాను చూస్తున్నాను నిన్ను చూస్తున్నట్లే ఆయనను చూస్తున్నాను ఆయన దివ్య తేజస్సు కనుపిస్తోంది అంతగా కావాలంటే నీవు కూడ చూడవచ్చు అన్నాడు తరవాత నరేంద్రుని జీవితంలో వచ్చిన మార్పు మనందరికీ తెలిసిందే

అటువంటి మహాపురుషుల పరంపర మనదేశంలో కొనసాగుతోంది ఇది మన మాతృభూమి యొక్క గొప్పతనం భగవంతుని దర్శించే యోగ్యత ఆమె దయ వల్లనే మనకు కలుగుతోంది

## 45 అహంకారానికి దూరంగా ఉండు

సామాజిక కార్యకర్తలు ఒక్కొక్కసారి అహంకారానికి గురి అవుతుంటారు నేను కర్తను అని ప్రజ్ఞావంతుణ్ణి సామాన్యులు నన్ను అర్థం చేసుకోలేకపోతున్నారు అనుకొంటారు ఇటువంటి ఆలోచనకు దూరంగా ఉండాలి

పూర్వకాలంలో మన దేశంలోని మహానుభావులందరు వినయ సంపన్నులుగా ఉండేవారు ఎవరైనా తమ సందేహాన్ని తీర్చుకోవడంకోసం వారి వద్దకు వెళ్ళితే మీకు వచ్చిన సందేహమే ఒకప్పుడు నాకు కూడా కలిగింది నేను మా గురువర్యులను అడిగాను ఆయన చెప్పిన విషయాలనే నీకు చెబుతున్నాను నీకు నచ్చితే స్వీకరించు, లేకపోయితే వదలిపెట్టు అనేవారు

ఇదంతా నేను స్వయంగా తెలుసుకొని చెబుతున్నాను అని ఎవ్వరూ అనేవారు కాదు ఉపనిషత్తులలో 'మహా మేధావులైన వారు సుదీర్ఘమైన ఆలోచన జరిపిన తరువాత ఈ విషయాలను నాకు చెప్పారు నేను దానినే మీకు చెప్తాను అని ఉన్నది నేను స్వయంకృషితో స్వీయ ప్రతిభతో దీనినంతా తెలుసుకొన్నాను మీ అందరికి నేర్పుతాను అని ఋషులెన్నడూ చెప్పలేదు

# 46 దేశంయొక్క గొప్పతనం

శ్రావణుడు తన తల్లిదండ్రులను తీర్థయాత్ర చేయించడం కోసం కావడిలో ఉంచి మోసుకొని పోసాగాడు హటాత్తుగా ఒకచోట ఆగి పోయాడు కావడిని దించి తల్లిదండ్రులతో నా యౌవనాన్నంతా మీ కోసం ఎందుకు వృథా చేయాలి? నా దారిన నేను పోతున్నాను అన్నాడు

తల్లి అతనితో నీ జీవితం వృథా అయిన మాట నిజమే కాని మమ్మల్ని అడవిలో వదలిపెడితే ఎట్లా? ఏదైనా ఊరి వద్దకు చేర్చి నీవు వెళ్ళిపో అన్నది సరే నంటూ వారిని ముందుకు తీసుకొని వెళ్ళాడు

ఊరి పొలిమేరను చేరగానే తల్లి ఇక ఫరవాలేదు మమ్మల్ని ఇక్కడ వదలిపెట్టి నీవు వెళ్ళవచ్చు అన్నది అదేమిటమ్మా అట్లా అంటావు? నేను మీ బిడ్డను కదా! మిమ్మల్ని ఇట్లా వదలిపెట్టి ఎట్లా వెళ్ళేది? అన్నాడు

కొడుకులో కలిగిన మార్పుకు తల్లి ఆశ్చర్యపోయింది అప్పుడు తండ్రి అది మయభూమి! ఆ స్థలం ప్రభావంవల్ల శ్రావణుడిలో మార్పు కనుపించింది ఇప్పుడు మామూలు స్థితికి వచ్చాడు అన్నాడు

మన మాతృభూమికి ఒక విశేషముంది అది భగవత్ సాక్షాత్కారానికి ప్రేరణ నిస్తుంది ఈ కార్యాన్ని నిర్వర్తించేవాడు మన గురువు తల్లి వందనీయురాలు తండ్రి వందనీయుడు గురువు వందనీయుడు ఈ మూర్తిత్రయం మన మాతృభూమియందున్నారు వారిని ప్రతిబింబిస్తూ మాతృభూమి మన ఎదుట ఉంది

# 47 ఆత్మవిశ్వాసం

చాలా మంది దృష్టిలో వినయముంటే అన్నిటికి తలవంచడమనే అభిప్రాయం ఉంది ఆత్మవిశ్వాసం లేకుండా ఉండడమనుకొంటారు ఇది సరికాదు మహా పురుషులు ఈ రెండు సద్గుణాలను సమాన దృష్టితో అలవరచుకొన్నారు

స్వామి రామతీర్థ జీవితంలో మనకు ఈ విషయం స్పష్టంగా కనిపిస్తుంది ఆయన ఒక పేద కుటుంబంలో జన్మించాడు ఆనాటి ఆచారం ప్రకారం ఆయనకు చిన్నతనంలోనే పెళ్ళి చేశారు మెట్రిక్ పాస్ కాగానే రామతీర్థ ఏదైనా ఉద్యోగంలో చేరి కుటుంబపోషణలో తనకు తోడ్పడితే బాగుంటుందని ఆయన తండ్రి అభిప్రాయపడ్డాడు రామతీర్థ ఆలోచనలు వేరుగా ఉన్నాయి ఆయనకు ఇంకా చదువుకోవాలని ఉంది ఈ వివాదం రోజురోజుకు పెరిగింది తండ్రి రామతీర్థను ఇంటినుంచి వెళ్ళిపొమ్మన్నాడు

తండ్రి ఆయన భార్యను వెంటబెట్టుకొని ఇంటినుంచి వెళ్ళిపోయాడు అప్పుడు రామతీర్థ వయస్సు 15 సంవత్సరాలు భార్య ఎనిమిదేళ్ళది చిన్నతనంనుంచి సీత దమయంతి వంటివారి కథలు విని ఉన్న దవడంచేత ఆమె భర్తవెంట నిస్సంకోచంగా వెళ్ళింది

వారికి ఒక చిన్న గది దొరికింది ఒక స్కూలులో పార్ట్ టైమ్ ఉద్యోగం సంపాదించాడు కాలేజీలో విద్యార్థిగా చేరాడు విద్యార్థి దశలో కఠోరమైన బ్రహ్మచర్యమును గడుపవలసి ఉన్నది తల్లిచేతివంట తప్ప ఇతర స్త్రీలు వండిన అన్నం తినరాదు అందువల్ల తానే వంట చేసేవాడు భార్యకు చదువు నేర్పడం మొదలుపెట్టాడు

ఎన్ని ఇబ్బందులున్నా ఎంతటి దారిద్ర్యాన్ని అనుభవించినా పట్టుదలతో చదివి అన్ని పరీక్షలలోను మంచి మార్కులతో ఉత్తీర్ణుడైనాడు ఎం ఏ లో సంస్కృతం దీసుకొన్నాడు లంతవరకు ఆయన సంస్కృతం ఏమాత్రం తెలియదు అయినప్పటికీ దృఢ సంకల్పంతో కృషిచసి ప్రథమ శ్రేణిలో ఉత్తీర్ణుడైనాడు

స్వయంకృషిని మించిన సహాయం లేదు

## 48 ఉపాసన వ్యాపారం కాదు

మహాభారతంలో ధర్మరాజుకు సంబంధించిన ఒక సంఘటన ఉన్నది పాండవులు ద్రౌపది అరణ్యంలో ఒకచోటనుంచి మరొక చోటికి తిరుగుతున్నారు ధర్మరాజు తాను ఏ పని చేస్తున్నప్పటికీ నిరంతరం భగవన్నామస్మరణ చేస్తుండేవాడు అష్టకష్టాలు పడుతున్న ద్రౌపది ఇది చిత్రమనిపించింది మీరెందుకు భగవంతుని స్మరిస్తారు? బాల్యం నుంచి చెస్తూనే ఉన్నారు అనేక యజ్ఞాలు చేశారు శాస్త్రాలలో చెప్పిన విధులన్నీ ఆచరించారు ఇప్పటివరకు భగవంతుడు ఏ విధమైన మేలు చేశాడు? ఉన్న రాజ్యం కాస్తా ఊడగొట్టాడు! అంటూ తన ఆవేదనను వెల్లడించింది

యుధిష్ఠిరుడు చిరునవ్వుతో ఉత్తుంగ హిమాలయ శృంగాలను చూడు ఎంత దివ్యంగా ప్రకాశిస్తున్నాయో! ఎంతటి ప్రశాంతత! ఎంతటి గాంభీర్యం! మనకు వాటిపట్ల అభిమానం లేదా? వాటినుంచి ఏదైనా ప్రతిఫలాన్ని ఆపేక్షిస్తామా? వాటి ఔన్నత్యమే మనలను వాటిని ప్రేమింపచేస్తున్నది భగవంతుని విషయంలోనూ అంతే ఆయన హిమాలయాల కంటె ఉన్నతుడు!'' అన్నాడు

ఉపాసన వ్యాపారం కాదు ... పే... మనం ఏదైనా ప్రతిఫలాన్ని ఆపేక్షిస్తే అది ఉపాసన కానేరదు

అయితే అదేదో పౌరాణిక యుగం నాటిమాట ఇది కలియుగం పరిస్థితులు వేరు అనుకుంటే ... ఖండోబలాల్ ఈ కాలం వాడే ఆయన దేశభక్తి ఉపాసనకు చక్కని ఉదాహరణ శంభాజీ మహారాజు భోగలాలసుడు యుక్తాయుక్త వివేచన లేనివాడు ఏదో నెపంతో ఆయన ఖండోబలాల్ తండ్రిని ఏనుగుచేత త్రొక్కించి చంపాడు అయినా ఖండోబలాల్ దేశసేవను విడనాడలేదు ఒకసారి రాజు దృష్టి ఖండోబలాల్ చెల్లెలి మీద పడింది పరిస్థితి అర్థం చేసుకొన్న ఖండోబలాల్ చెల్లెలు విషం మింగి చనిపోవడానికి ఉపక్రమించాడు ఆ విధంగా ఆమె శీలం కాపాడబడింది ఖండోబలాల్ ఎటువంటి మాట అనలేదు శివాజీ మహారాజ్ అనేక త్యాగాలు చేసి ... స్వరాజ్యం పునాదులు ఇంకా గట్టిపడలేదు ఆయన తరవాత ... శక్తులను శంభాజీ ... మైనాడు అందువల్ల వ్యక్తిగత శీలం మంచిది కానప్పటికీ రాష్ట్ర శ్రేయస్సును దృష్టిలో ఉంచుకొని ఖండోబలాల్ వ్యవహరించాడు శంభాజీని ఔరంగజేబు బంధించినపుడు ఆయనను విడిపించడానికి విశేషమైన కృషి చేసాడు తరవాత రాజారామ్ విషయంలోను అంతటి శ్రద్ధ చూపాడు తన సర్వస్వాన్ని దేశం కోసం సమర్పించాడు ఇదీ భారతమాత యొక్క నిజమైన ఉపాసన

## 49 అధికార దుర్వినియోగం

రాజకీయ నాయకుల లక్షణాలు ప్రభుత్వ కార్యాలయ ఉద్యోగులకు కూడా వస్తుంటాయి ప్రభుత్వంలో ఉండే లోపాలు పైనుండి క్రిందివరకు వ్యాపిస్తాయి ఎవరైనా సరైన ఆఫీసర్ వచ్చాడంటే అతని దగ్గర పని చేయడం ఆ కార్యాలయ ఉద్యోగులకు చాల కష్టమనిపిస్తుంది

ఒకసారి కప్పలు తమకొక నాయకుని ప్రసాదించమని భగవంతుని ప్రార్థించాయి వారి ప్రార్థనను మన్నించి ఆయన ఒక కట్టె ముక్కను ఇచ్చాడు వాటికి ఇది ఏమాత్రం నచ్చలేదు ఇదెక్కడి రాజు అనుకొన్నాయి మరల భగవంతుని ప్రార్థించాయి ఈసారి భగవంతుడు ఒక పక్షిని పంపించాడు అది దొరికిన కప్పను తినడం ప్రారంభించింది కప్పలు నిరాశ చెందాయి ఇదివరకటి రాజే మంచివాడు అనుకొన్నాయి ఇంతకు ముందున్న రాజు క్రియాశూన్యుడు అయితే అతనివల్ల ఎవరికీ బాధ కలుగలేదు అధికార దర్పం మనుష్యులను అనేక రకాలుగా చెడగొడుతుంది

## 50 మనువు

ఒకసారి మనువు నీటి బయట కొట్టుకుంటున్న చేపను చూసాడు ఆయనకు దాని మీద జాలి కలిగి దానిని తన కమండలంలో వేసాడు కొద్ది రోజుల్లో అది పెద్దదైంది దానికి కమండలంలో చోటు చాల లేదు మనువు దానిని ఒక పెద్ద జలాశయంలో వేసాడు కాని కొన్నాళ్ళ తరవాత ఆ జలాశయముకూడ చాలలేదు ఆయన దానిని ఇంకా పెద్ద జలాశయంలో వేశాడు క్రమంగా అది పెరిగినకొల్లా దానిని నదిలోకి, ఆ తరవాత సముద్రంలోకి మార్చాడు తరవాత మహా ప్రళయం వచ్చింది యావత్ప్రపంచం జలమయమైంది అప్పుడు ఆ చేప మనువును తన వీపుపై కూర్చుండబెట్టుకొన్నది ఆ విధంగా మనువు రక్షింపబడ్డాడు ప్రళయం అంతమైన తరవాత మనువు తిరిగి ప్రపంచాన్ని సృష్టించాడు సంఘం కూడ నాటి చేపవలెనే నిరంతరం పెరుగుతోంది

## 51 హిందువునని చెప్పడానికి సిగ్గెందుకు?

వారు తెలిసి [illegible] కొడుకు వారి ఆర్థిక స్థితి అంత గొప్పదేమీ కాదు అయినప్పటికీ తండ్రి అనేక కష్టాలనోర్చి కుమారునికి పెద్ద చదువులు చెప్పించాడు అందువల్ల కుమారునికి పెద్ద ఉద్యోగం వచ్చింది ఉద్యోగానికి తగినట్లు అతని భార్య సంపన్న కుటుంబం నుంచి వచ్చింది వారు పెద్ద బంగళాలో ఉండేవారు తండ్రి మాత్రం వారికి ఇబ్బంది కలిగించరాదని భావించి వేరుగా ఉంటూ తన పని తాను చేసుకొంటున్నాడు ఒకరోజున అతనికి తనకు మనుమడు పుట్టాడని తెలిసింది పిల్లవాడిని చూడాలని కుమారుని ఇంటికి వెళ్ళాడు తండ్రి వెళ్ళేటప్పటికి కొడుకు తన స్నేహితులతో కలసి టీ తాగుతున్నాడు తండ్రిని చూచి కొడుకు ఆందోళన చెందాడు తన స్నేహితులు ఈ పల్లెటూరి మనిషి తన తండ్రి అని కనుక్కొంటారేమోనని భయపడ్డాడు తండ్రితో పక్కవాకిలి ద్వారా లోపలికి పొండి అన్నాడు కాని అతని స్నేహితులు చూడనే చూసారు ఆయన ఎవరు? అని అడిగారు మా పాత నౌకరు ఇప్పుడే గ్రామం నుంచి వస్తున్నాడు అన్నాడు ఈ మాటలు తండ్రికి వినిపించినవి చాల బాధ కలిగింది ఆయన తన కుమారుని స్నేహితులతో "వాడి తల్లిని అడగండి నేనెవరో చెబుతుంది అన్నాడు వెంటనే తిరిగి తన ఇంటికి పోయాడు

విదేశీవిద్య కారణంగా స్వార్థపూరితమైన వాతావరణంలో పెరగడం వల్ల వ్యక్తులలో అహంకారం స్వాభిమాన రాహిత్యం కొట్టవచ్చినట్లు కనబడుతోంది అందువల్ల తాము హిందువులమని చెప్పుకోవడానికి సహితం సిగ్గుపడుతున్నారు

## 52 సిద్ధాంతం వెనుక శక్తి ఉండాలి

పాణిని సంస్కృత భాషకు గొప్ప వ్యాకరణాన్ని రచించినాడు ఆయన దానిని ప్రచారం చేయసాగాడు ఇతర పండితులకు తమ ప్రతిష్ఠ ఎక్కడ తగ్గిపోతుందో అనే భయం పట్టుకొంది వారంతా కలిసి ఆయన మీద ప్రశ్నల వర్షం కురిపించసాగారు వాళ్ళు చేసే గోలలో పాణిని మాట ఎవరికీ వినిపించలేదు చివరకు గత్యంతరం లేక పాణిని శంకరుని ధ్యానించాడు ఆపదలో ఉన్న భక్తులను ఆయన ఆదుకొంటాడు ఆయన పాణిని ప్రార్థనను ఆలకించాడు మరునటి రోజు పాణిని పండితులు గోల చేయడం మొదలు పెట్టార ఇంతలో ప్రళయ భయంకరమైన ఢమరుక నాదం వినిపించింది పండితులు భయభ్రాంతులైనారు ఆ తరవాత వారు పాణిని చెప్పింది శ్రద్ధలో వినడం మొదలుపెట్టారు

వ్యాకరణం నేర్చుకోవడానికి సహితం ఢమరుక నాదం అవసరమైంది అటువంటిది భారతీయ తత్త్వజ్ఞానాన్ని వినిపించడానికి ఎంతశక్తి అవసరం? అందువల్ల సుసంఘటితము శక్తి సంపన్నము అయిన హిందూ సమాజము మాత్రమే ఆ పనిని చెయగలుగుతుంది

## 53 నిష్ఠ

గోస్వామి తులసీదాస్ గొప్ప రామభక్తుడు ఆయనకు కోదండ ధారియైన శ్రీరాముడంటే అమిత శ్రద్ధ నిరంతరం ఆయన మనస్సులో ఆ రూపమే మెదలుతూ ఉంటుంది మరి ఏ ఇతర విగ్రహానికి ఆయన నమస్కరించేవాడు కాడు రామచంద్రుని రూపంతో మాత్రమే పరమేశ్వరుని దర్శించేవాడు ఆయన నిష్ఠ అటువంటిది

గొంబలి ఆయనను పరీక్షించాలనిపించింది. ఒకరోజు ఆయనను చెప్పకుండా కృష్ణమందిరానికి తీసుకొనిపోయారు. ఆయన ఇదేమీ పట్టించుకోలేదు. ఆయన మనస్సు శ్రీరామచంద్రుని యందు లగ్నమై ఉన్నది. నైవేద్యం సమర్పించే సమయం వచ్చింది. ఆయన కళ్ళు తెఱచి చూశాడు. ఎదురుగా శ్రీకృష్ణుని మనోహర రూపం సాక్షాత్కరించింది. అయితే తులసీదాస్ స్పష్టంగా చెప్పాడు. నేను ఈయనకు నమస్కరించను. భగవంతుడు కోదండధారియై ఆయనకు కనిపించాడు.

## 54 రాక్షస మైత్రి

ఒకప్పుడు ఒక బలవంతుడైన వాడు ఒక మరుగుజ్జువాడు కలసి ఉంటుండేవారు. ఒకరోజున పొట్టివాడికి సాహసకార్యాలు చేయాలనే కోర్కె కలిగింది. ఇద్దరం కలసిపోదాం అన్నాడు. మిత్రుడు అంగీకరించాడు. పోతుంటే దారిలో వారికి ఒక దొంగల స్థావరం కనుపించింది. పొట్టివాడు ఉద్రేకంతో దాడి చేశాడు. బలవంతుని చేతిలో దొంగలు మరణించారు. మిగిలినవారు పారిపోయారు. వారి ధనం బలవంతుని పరమైంది. కాని పొట్టివాడికి ఒక కాలు తెగిపోయింది. వారిద్దరు మరికొంత దూరం ముందుకుపోయారు. వారు ఒక దుష్టుని పాలనలో ఉన్న రాజ్యాన్ని చేరారు. అత్యంత సాహసంతో పొట్టివాడు కాపలాగా ఉన్న సైన్యంపైన దాడి చేశాడు. ఈసారి వాడి చేయి ఒకటి తెగిపోయింది. ఇంతలో బలవంతుడు వారిమీద విరుచుకుపడ్డాడు. అతనిచేతిలో అనేకమంది మరణించారు. చావగా మిగిలినవారు పారిపోయారు. నగరం బలవంతుని వశమైంది. తరవాత వారికి ఒక వార్త తెలిసింది. దుర్మార్గుడైన రాక్షసుడు ఒక అతిలోక సౌందర్యవతిని చెఱబట్టి ఉన్నాడు. వెంటనే రాక్షసుడిపైకి ఇద్దరు దాడి చేశారు. ఒక కాలు ఒక చేయి లేకపోయినప్పటికీ పొట్టివాడు

రాక్షసునితో యుద్ధం చేశాడు [illegible] అతని [illegible] స్నేహితుడు దుష్టుని వధించి సుందరిని విడిపించాడు ఆమె అతనిని వివాహం చేసుకొన్నది

బలహీనుడు బలవంతునితో స్నేహంచేస్తే ఫలితం ఈ విధంగానే ఉంటుంది స్నేహంవల్ల లభించే లాభాలన్నీ బలవంతుడికే దక్కుతాయి బలహీనుడు దుర్దశను అనుభవిస్తాడు

## 55 భ్రమపడవద్దు

రామాయణంలో ఒక కథ ఉంది లంకవద్ద జరిగిన యుద్ధంలో లక్ష్మణుడు ఇంద్రజిత్తును వధించి అతని శిరస్సును తన శిబిరానికి తీసుకొని వచ్చాడు ఇంద్రజిత్తు భార్య సులోచన భర్తతో సహగమనం చెయాలనుకొన్నది కాని అతని శిరస్సు లభించలేదు ఇంతలో ఎవరో చెప్పారు శిరస్సు శ్రీరామచంద్రుని శిబిరంలో ఉంది ఆమె స్వయంగా బయలుదేరింది వానరులు దూరంనుంచి తమ శిబిరం వైపు వస్తున్న సులోచననుచూసి ఆమే సీత అనుకొని ఆనందంతో గంతులు వేయసాగారు వారి కోలాహలాన్ని విన్న రాముడు మాత్రం రావణుడు ఇంకా జీవించే ఉన్నాడు సీత అతని వద్ద బందీగా ఉంది రావణుని వధించి మాత్రమే మనము సీతను విడిపించుకోవాలి భ్రమలో పడవద్దు అన్నాడు

## 56 విముక్తి కావాలా? మృత్యువు కావాలా?

సోమనాథ మందిరంలో అపారమైన సంపద ఉంది ఈ విషయం తెలుసుకొన్న మహమ్మద్ గజనీ దానిపై దండెత్తి వచ్చాడు అక్కడికి చేరడానికి అతను పంజాబ్ రాజస్థాన్ సౌరాష్ట్ర ప్రాంతాలను దాటవలసి యున్నది కొన్నివేల మైళ్ళు ప్రయాణం చేయాలి ఇదేమీ [illegible]

అరణ్యంకాదు అక్కడ అనేక చిన్న రాజ్యాలున్నాయి అయితే ఈ రాజ్యాలవారికి గుజరాత్ రాజ్యంతో మంచి సంబంధాలు లేవు వీరందరు మహమ్మద్‌ను ఎదిరించినట్లయితే అతడు సోమనాథ్ వరకు రావడ మనే ప్రశ్నే ఉండేదికాదు రాజస్థాన్ ఎడారి ద్వారా ప్రయాణించినట్లయితే అతని సైన్యాలు తిండి నీరు దొరకక నశించిపోయేవి కాని మహమ్మద్ తెలివైనవాడు నేను చిన్న చిన్న రాజ్యాలవారికి మిత్రుణ్ణి మీ అందరికి గుజరాత్ రాజ్య దురాక్రమణ నుంచి విముక్తి కలిగించడానికి వచ్చాను అంటూ ప్రకటించాడు విముక్తి అనే పదం వింటూనే రాజులందరు పరవశించిపోయారు వారు గజనీని ఎదిరించవలసిందిపోయి అతడికి అన్ని విధాలా తోడ్పడ్డారు పర్యవసానం మనందరికీ తెలిసిందే

గజనీ కోర్కె నెరవేరింది విముక్తి భ్రమలో ఉన్న రాజులకు త్వరలోనే తెలిసివచ్చింది వారందరు తమ బంధువులను ఆత్మీయులను కోల్పోయారు జీవితాంతం పరాయిరాజులకు దాస్యం చేయవలసి వచ్చింది

## 57 మాతృవత్ పరదారేషు

**1948** నాటిమాట సంఘంపైన ఒక పెద్ద ఆరోపణ చేయబడినది అసత్యమైన ఆరోపణ అది ఒకరోజు కోపోద్రిక్తులైన జనసమూహం ఒక ఇంటి మీద దాడి చేసింది ఆ ఇంటి తలుపులు మూసి ఉన్నాయి ఇంట్లో పురుషు లెవ్వరూ లేరు ఇంటిలో ఒక స్త్రీ ఉన్నది ఆమె భయంతో తలుపులు తెరిచింది ఆమెను చూడగానే గుంపులో ఉన్నవారంతా ఆగిపోయారు ఆ జనంలో గూండాలున్నారు పచ్చినెత్తురుతాగే కసాయివారున్నారు అయినప్పటికీ ఎవ్వరూ ముందుకు అడుగువేయలేదు వేల కొలది సంవత్సరాల పరాయిపాలన కారణంగా ప్రజాజీవనంలో అనేక

వికృతులు ప్రవేశించినప్పటికీ పరంపరాగతమైన మన సంస్కారం వారిని విడనాడలేదు మాతృవత్ పరదారేషు అనేది మన ప్రాచీన సూక్తి అదే వారి మనసులలో మెదలింది ఆమెకు ఇద్దరు వ్యక్తులను తోడు ఇచ్చి రిక్షాలో సురక్షిత స్థానానికి పంపించారు

మన సంస్కృతి యొక్క ప్రభావం అటువంటిది గంజాయి తోటలో ఎక్కడో ఒక తులసిమొక్క మొలచినట్లు నేటి పరిస్థితులలో సహితం హిందువుల హృదయంలో సద్భావన ప్రకటితమవుతుంటుంది

## 58 కార్యనిష్ఠ

ఒకప్పుడు లోకమాన్య తిలక్ కుమారులలో ఒకరికి జబ్బు చేసింది ఒకవైపు కుమారుని ఆరోగ్యం పట్ల శ్రద్ధ చూపుతూనే మరొకవైపు కేసరి పత్రిక పనిని చూస్తున్నారు ఒకరోజు ఆయన సంపాదకీయం వ్రాస్తున్నారు ఇంతలో ఇంటినుంచి కబురు వచ్చింది కుమారుని ఆరోగ్య పరిస్థితి అందో ళనకరంగా ఉందని వార్త తెచ్చిన వ్యక్తితో తిలక్ మీరు వైద్యుని పిలవండి ఆయనే మందు ఇస్తాడు నేను పని పూర్తికాగానే వస్తాను' అన్నాడు

పని పూర్తిఅయిన తరవాత తిలక్ ఇంటికి వెళ్ళారు కాని అప్పటికే ఆయన పుత్రుడు మరణించాడు ఆయన ప్రశాంత చిత్తంతో కుమారునికి దహన సంస్కారాలు చేసారు తిలక్ కర్తవ్యనిష్ఠ అటువంటిది

## 59 పరులయింట భుజించను

మనం ప్రతి హిందువును కాబోయే స్వయంసేవక్‌గా భావిస్తాము అటువంటిది మనకు పరాయివాడంటూ ఎవరుంటారు?

ఒకసారి పరమ పూజనీయ గురూజీ ఒక పెద్దమనిషిని కలుసుకోవ డానికి వెళ్ళారు ఆయన వెంట స్థానిక కార్యకర్త ఒకరున్నారు సంభాషణ పూర్తి అయిన తరువాత ఆ కార్యకర్త రేపు గురూజీ మా యింటికి భోజనానికి వస్తున్నారు తమరు కూడా మా యింటికి భోజనానికి దయచేయండి అన్నాడు

ఆ పెద్దమనిషి మీ ఆహ్వానము నాకు ఎంతో ఆనందము కలిగించింది కాని నా కా భాగ్యములేదు నేను పరులయింట భుజించను అన్నాడు

అప్పుడు గురూజీ పరులయింట భుజించరాదనే నియమం నాకు గూడా ఉంది నేను దానిని అత్యంత శ్రద్ధతో పాటిస్తున్నాను అన్నారు అందరు ఆశ్చర్యంతో చూస్తున్నారు

ఇంతలో ఆ పెద్దమనిషే అడిగాడు అదెట్లా? రేపు మీరు ఆయన ఇంటికి భోజనానికి వెళుతున్నారు కదా?

గురూజీ ఆయన ఇల్లు పరాయి ఇల్లు ఎట్లా అవుతుంది? ఆయన పరాయివాడా? మనవాడే మన స్వయంసేవక్ మన ఆత్మీయుడు అన్నారు

## 60 అనుశాసనము

ఎన్ సి సి స్కౌట్ మొదలైన వాటిద్వారా యువకులలో అను శాసనాన్ని పెంపొందించవచ్చునని అంటుంటారు కాని సంఘంలో కనిపించే అనుశాసనం వంటిది మరింకెక్కడైనా కనుపిస్తుందా?

ఒక నగరం సమీపంలో రెండు రోజుల శిబిరం నిర్వహించాలని యోజన చేశారు సరియైన స్థలం కోసం వెదికారు ఒక తోట కనుపిం

చింపి అందులో మామిడి చెట్లున్నాయి తోటలో బావి పంపు ఉన్నాయి అన్నివిధాలా అనువైనచోటు ఆ తోట యజమాని దగ్గరకు మన కార్య కర్త ఒకరు వెళ్ళారు మొదట్లో ఆయన ఒప్పుకోలేదు క్రితంసారి ఎన్ సి సి వారు వచ్చారు నాకు ఇష్టం లేకపోయినప్పటికి ప్రభుత్వ అధికారుల ఒత్తిడికి లొంగి ఇచ్చాను కాని వారు మొత్తం తోటను ధ్వంసం చేశారు వారు మామిడిపళ్ళను తినలేదు అవి పచ్చిగా ఉన్నాయి కొమ్మలు విరిచేశారు నాకు చాలా నష్టం వచ్చింది అన్నాడు

కార్యకర్త శిబిరం ఎట్లా ఉండేది ఆయనకు వివరించారు మేము సంఘ శిబిరం కోసం మాత్రమే అడుగుతున్నాము మరి ఏ ఇతర సంస్థ కోసం కాదు అన్నారు

వెంటనే ఆయన తప్పకుండా ఇస్తాను మీ సంగతి నాకు తెలుసు తాకవద్దని సూచన ఇస్తే చాలు కనీసం ఆకును సహితం ముట్టుకోరు అంటూ అనుమతి ఇచ్చాడు

అక్కడ శిబిరం నిర్వహించారు ఆఖరురోజు పెద్దల సమావేశం జరిగింది అందులో ఆయన కూడా పాల్గొన్నారు నేను ముదట్లో తోట ఇవ్వడానికి నిరాకరించాను కాని సంఘం పేరు ఎ గానే అది అనుశాస నానికి పెట్టింది పేరు స్వయంసేవకులవల్ల తోటకు నష్టం రాదు అనుకొ న్నాను అనుమతించాను అన్నారు

ఆయన చెప్పినదానిని గురించి ఆలోచిస్తే మనకు కొన్ని విషయాలు తెలుస్తాయి అనుశాసనానికి ఆధారం స్థిరచిత్తం, రాష్ట్రభక్తి ఆ కారణంగా శరీరం కూడ సరిగా వ్యవహరిస్తుంది మనస్సు శరీరము బుద్ధి ఈ మూడింటి వికాసానికి పనికివచ్చే విధంగా సంఘశాఖ రూపొందించ బడింది

# 61 నిరంతరం పనిచేయడం

నేడు ప్రజాజీవనం అస్తవ్యస్తమైంది నియమపూర్వకంగా ఒక పనిని చేయగల సామర్థ్యం తగ్గిపోయింది ప్రజలముందు ఒక లక్ష్యమంటూ లేకుండాపోయింది అందువల్ల ప్రజలకు తమకు నిర్దేశింపబడిన పనిని చేయడంలో ఆసక్తిలేదు వారికదే కష్టంగా కనుపిస్తుంది

గురూజీ తమ పర్యటనలో ఒక ఇంటిలో బస చేశారు ఆ ఇంటిలో పరీక్షలకు చదువుతున్న ఒక విద్యార్థి ఉన్నాడు అతడు సంవత్సరం అంతా చదవకుండా అశ్రద్ధ చేశాడు శ్రీ గురూజీ రూపాన్ని చూసి ఆయన సన్యాసి లేదా బాబా అయివుంటాడనుకొన్నాడు ఆయనను సమీపించి నాకు చదువు మీద ధ్యాస ఉండటం లేదు ఏకాగ్రతను సాధించడమెట్లా? అని ప్రశ్నించాడు గురూజీ అతనిని రోజూ కొన్ని పనులు చేయమని సలహా ఇచ్చారు దానిని ఎన్ని రోజులు చేయా లని విద్యార్థి అడిగాడు ఉపయోగకరంగా ఉన్నదనిపిస్తే నిరంతరం చేయవలసివుంటుంది అన్నారు గురూజీ

అది నావల్ల కాదు ఏ పనిని నిరంతరం చేయరాదనేది నా సిద్ధాంతము అన్నాడు విద్యార్థి

అప్పుడు గురూజీ కనీసం నీ సిద్ధాంతాన్ని అయినా నిరంతరం అనుసరిస్తావా? నీవేమి చేయగలుగుతావు? వెళ్ళి సంతోషంగా కాలంగడుపు అన్నారు

మనకు వాతావరణం ఈ విధంగా తయారైంది ఏ పనినైనా ఆపకుండా నిరంతరం చేసే అలవాటు తప్పిపోయింది అటువంటి ఆలోచనయే కరువైంది

## 62 దుష్టశక్తి అక్కరలేదు

మనం కేవలం శారీరక శక్తిని మాత్రమే సాధిస్తే చాలదు దానికి ఆధారంగా సద్గుణములు శీలము పవిత్రత ఉండాలి అప్పుడు సమాజం పట్ల ప్రేమ పరోపకారం చేయాలనే కోర్కె కలుగుతాయి శక్తిపైన ఈ విధమైన నియంత్రణ లేనట్లయితే ఇతరులను బాధించి ఆనందించాలనే కోర్కె కలుగుతుంది

వ్యక్తి విషయంలోనైనా లేదా రాష్ట్రం విషయంలోనైనా బలంతో పాటే శీలము లేనట్లయితే దానిని రాక్షసశక్తి అంటాము లంకలో రాక్షసులతో యుద్ధం జరుగుతోంది శ్రీరాముడు తన సైన్యం మధ్యలో ఉన్నాడు ఇంతలో ఒక బలవంతుడు పరాక్రమవంతుడు తేజోశాలియైన వ్యక్తి రావడం కనుపించింది శ్రీరాముడు విభీషణా! ఈ మహావీరు డెవరు? అని అడిగాడు అప్పుడు విభీషణుడు అతడే మీ శత్రువు రావణుడు అన్నాడు శ్రీరాముడు ఎంతటి తేజస్సు! ఎంతటి పరాక్రమము! పాపంచేసేవాడు కానట్లయితే ముల్లోకాలు ఏలదగినవాడు అంటూ ప్రశంసించాడు

రావణుని శక్తి దుర్గుణాలతో కూడుకొన్నది అందువల్లనే ఆయనను రాక్షసుడన్నారు మనకు అటువంటి రాక్షస శక్తి అక్కరలేదు

## 63 నేనొక్కడనే చాలు

అన్ని రకాల ఇబ్బందులను అధిగమించి లక్ష్యాన్ని చేరడానికి మనకు జ్ఞానము ధైర్యము పౌరుషము అవసరము ఎవరైన తోడు ఉండనీ ఉండకపోనీ నేను ఒక్కడనే తలపెట్టిన పని చేస్తాను! అటువంటి దృఢ సంకల్పం ఉండాలి శ్రీకృష్ణుని జీవితంలో మనకు అట్టి ఉదాహరణ కనుపిస్తుంది

వనవాసాన్ని అజ్ఞాతవాసాన్ని పూర్తిచేసిన తరవాత పాండవులు తమ రాజ్యాన్ని తిరిగి ఇవ్వమని అడిగారు అందుకోసం దూతను పంపించారు కాని దుర్యోధనుడు రాజ్యం ఇచ్చేదిలేదని చెప్పి వానిని పంపివేశాడు

చివరకు శ్రీకృష్ణుడు తానే స్వయంగా వెళ్ళడానికి సిద్ధమైనాడు ధర్మరాజు ఆందోళనతో స్వామీ! మీరే మా సర్వస్వము మిమ్మల్ని దుర్యోధనుడు బంధించినా వధించినా మాకు దిక్కంటూ లేకుండా పోతుంది అన్నాడు

అప్పుడు శ్రీకృష్ణుడు ఆ ప్రయత్నమే జరిగితే నీకు ఏ పనీ ఉండదు నేను కౌరవులందరిని అక్కడే చంపివేస్తాను హస్తినాపురం నీ వశమవుతుంది యుద్ధం చెసే పనే లేదు అన్నాడు

శ్రీకృష్ణుడు మన ఆరాధ్యదైవము మనం ఆయన వలెనే ధైర్యము ఆత్మవిశ్వాసము అలవరచుకోవాలి

## 64 ఈ కీర్తి నాదేననుకోవడం హాస్యాస్పదం

ఒక ఒంటె పోతోంది దాని ముక్కుకు కట్టిన తాడును రౌతు వదలి పెట్టాడు తాడు చివర నేలమీదపడి ఉంది కొంత దూరం పోయేటప్పటికి ఒక ఎలుక ఆ తాడును నోటితో పట్టుకొని ఒంటెతోబాటు పరుగెత్త సాగింది కొంత దూరం ఆ విధంగా వెళ్ళేటప్పటికి దానికి గర్వం కలిగింది ఒంటె చాలపెద్ద జంతువు బలమైనది అంటారు అంతా కాని నేను దానిని ముక్కు పట్టుకొని నడిపిస్తున్నాను అనుకొన్నది

ఏదైనా మహత్కార్యంలో భాగం పంచుకొన్న వ్యక్తులు తామే ఈ కార్యాన్నంతా చేశామనుకొంటే అది మన కథలోని ఎలుక స్థితిని జ్ఞప్తికి తెస్తుంది

# 65 భారతీయ ఏకాత్మను మరువరాదు

నాగపూర్‌లో ఒక వార్తాపత్రమును నడపడం అవసరమనిపించింది దానికోసం డాక్టర్జీ చాలా ప్రయత్నం చేశారు విరాళం కోసం ఒక బెంగాలీ పెద్దమనిషి ఇంటికి వెళ్ళారు కొంత సంభాషణ నడిచింది ఆయన నేను బెంగాలీని మరాఠీ పత్రికను ఏమి చేస్తాను? ఆనంద బజార్ వంటి పత్రికలను చదువుతూనే ఉన్నాను కలకత్తా సంగతులు తెలుస్తున్నాయి బెంగాల్‌కు సంబంధించిన వార్తలు విశేషాలు తెలుసుకోగలుగుతున్నాను అన్నాడు

డాక్టర్జీ ఆయనతో మీరు ఇక్కడే మీ వృత్తి వ్యాపారాలు కొనసాగిస్తున్నారు అందువల్ల ఇక్కడి ప్రజలతో మీకు సన్నిహిత సంబంధం ఉండవలసి ఉన్నది మీరు ఇక్కడి ప్రజాజీవనంలో కలిసిపోవలసి యున్నది అన్నారు డాక్టర్జీ చెప్పిన సంగతులు ఆయనకు నచ్చినవి కొంత విరాళం కూడా ఇచ్చాడు

ఈ విషయాన్ని వివరిస్తూ డాక్టర్జీ ఒక కథ చెబుతుండేవారు నదీ తీరంలో ఒక కోతి ఉంటుండేది అక్కడికి ఒక మొసలి వస్తుండేది మొసలికి కోతికి స్నేహం కుదిరింది కోతి మొసలి వీపు మీద కూర్చొని నదిని దాటుతుండేది ఒక రోజు తన వీపు మీద ఉండగా 'నీవు ఇటు, అటు దూకుతుంటావు కదా నీ గుండె కింద పడిపోదా? నీ గుండెను చూడాలని ఉంది అన్నది మొసలి

కోతి తెలివైనది నేను నా గుండెను చెట్టుకు తగిలించి ఉంచుతాను అందువల్ల నాకు గుండెను గురించిన చింత లేదు ఎట్లా దూకినప్పటికీ అది పడిపోదు అన్నది

కోతి హృదయం చెట్టుమీద ఉండవచ్చు కాని మనుష్యుని హృదయం అట్లా చెట్టు మీద ఉండడానికి వీలులేదు ఇక్కడ కేవలం ధనం సంపాదించడం అనుభవించడం మిగిలిన వ్యవహారం అంతా కల కర్తావారితో మంచిచెడును గురించిన ఆలోచన అంతా తన భాష మాట్లాడే వారితో ఇది సరియైన పనికాదు మనం ఏ ప్రాంతం నుంచి వచ్చినవార మైనా కావచ్చు కాని ఎక్కడ పనిచేస్తున్నామో ఎక్కడ నివసిస్తున్నామో అక్కడి ప్రజా జీవనంతో కలిసిపోవాలి భారతీయ ఏకాత్మను అంగీకరించి వ్యవహరించాలి డాక్టర్జీ ఈ విషయాన్ని నొక్కి చెబుతుండేవారు

## 66 సంఘటన - గుంపు

కేవలం ఒక లక్ష్యం కోసం పెద్ద సంఖ్యలో జనం పోగైతే అది సంఘటన కానేరదు అది కెవలం జనసమూహం మాత్రమే

అది నాగపూర్‌లో జరిగిన ఒక ఘటన చిట్నీస్ పార్కులో ఒక గొప్ప నాయకుడు ఉపన్యసించ నున్నాడు ఆయన దేశమంతటా పర్య టిస్తున్నాడు ఆయన ఉపన్యాసం చాల బాగుంటుంది అది వినడం కోసం ఆ రోజు దాదాపు 30 వేల మంది అక్కడికి చేరారు ఉపన్యాసం మొద లైంది శ్రోతలు శ్రద్ధగా వింటున్నారు ఇంతలో ఒక కప్ప ఒకని మీదకు దూకింది ఆ మనిషి గాభరా పడ్డాడు బహుశా కప్పవెంట దానిని తరు ముతూ పాము వచ్చి ఉంటుందనుకొన్నాడు పాము గుర్తురాగానే ఆయనకు భయం వేసింది పాము పాము అని అరుస్తూ పరుగెత్తసాగాడు దూరం నుంచి మరికొందరు పాము పాము అని అరవసాగారు దానితో సభ అంతా అల్లకల్లోలమైంది ఉపన్యాసం ఆగిపోయింది

వివరకు సభకు ఎందుకు అంతరాయం కలిగిందని విచారిస్తే ఏం జరిగిందో ఎవరికీ తెలియదు అరుపులు వినిపించగానే పరుగెత్తాను అన్నాడు అదేమిటయ్యా ఎవ్వరినైనా అడగరా ఏమి జరిగింది? ఎందుకు పరుగెత్తుతున్నారు? అని అందుకు ఆయన సమాధానం చెప్పాడు ఏమి చేయమంటారు? నేనొక్కడినై పోయాను ఏమి చేయగలను?

ఈ సంఘటనను వివరించి డాక్టర్జీ ఇది నిజంగా ఆశ్చర్యకరమైనది సభలో 30 వేల మంది ఉన్నప్పటికీ ప్రతివాడు తానొక్కడనే అనుకుంటున్నాడు అసంఘటితమైన సమాజం పరిస్థితి అంతే అన్నారు

## 67 నిర్మాణాత్మకమైన పనులు ఉద్రేకంవల్ల కావు

ఆందోళనలు సమ్మెలు ఉద్రేకపూరిత ప్రసంగాలు నేడు మనం సాధారణంగా చూసే కార్యక్రమాలు కాని ఇటువంటివి క్షణికమైనవి అంతేగాక ఉద్రేకంలో ఉన్నవారి మనస్సులో అదుపు ఉండదు అందువల్ల వాటినుంచి ఎటువంటి శాశ్వత ఫలితాలు రావు

ఈ సందర్భంలో షేక్స్పియర్ నాటకంలోని ఒక సన్నివేశం గుర్తుకు వస్తుంది జూలియస్ సీజర్‌ను హత్య చేశారు అతని శత్రువులు సీజర్‌ను చూడడానికి వచ్చిన జనసమూహాన్ని ఉద్దేశించి ప్రసంగిస్తూ సీజర్ గొప్ప వ్యక్తి అనడంలో సందేహం లేదు కాని ఆయన ప్రజాస్వామ్యాన్ని ఖూనీ చేశాడు తాను నియంత కావాలని కలలు కన్నాడు మేము ఒక ప్రజాద్రోహిని అంతం చేశాము అంటూ వివరించారు ఈ మాటలు అక్కడి జన సమూహానికి బాగా నచ్చాయి వారిందరికీ సీజర్ పైన కోపం వచ్చింది

కొంత సేపైన తరువాత సీజర్ స్నేహితులలో ఒకడు అక్కడ ఉన్న ప్రజా సమూహాన్ని ఉద్దేశించి ప్రసంగించడం మొదలు పెట్టాడు సీజర్‌ను చంపడానికి గల అనేక కారణాలను గురించి మీరు తెలుసు కొన్నారు అవన్నీ సరైనవే కాని సీజర్ మీ అందరికీ అనేక విధాలుగా మేలు చేసియున్నాడు కాబట్టి సీజర్ యొక్క వాస్తవ రూపాన్ని మీ ముందుంచడానికి నన్ను అనుమతించవలసింది అని ప్రార్థించాడు అక్కడి శ్రోతలు ఆయనను మాట్లాడవలసిందిగా కోరారు ఆయన తన సంభాషణా చాతుర్యంతో సీజర్ హంతకులపట్ల జనసామాన్య క్రోధాగ్నిని ప్రజ్వరిల్లచేశాడు జనులు మహోద్రేకంతో నినాదాలు చేస్తూ సీజర్ హంత కుల ఇళ్ళపై పడి ధ్వంసంచేసి వారిని చంపవేశారు

జనసమూహాన్ని ఉత్తేజితులను చేసి వారిని ఒక పనిదిశలో కార్యో న్ముఖులను చేసిన తరవాత నాయకులకు వారిపై ఎటువంటి అదుపు ఉండదు సంఘటన వేరు అనుశాసనము ఓర్పు మొదలైన సంస్కా రాలు సంఘశాఖలో మనకు లభిస్తున్నాయి అందువల్ల ఆలోచనలను అదుపు చేయడం బుద్ధిని సమాజహిత కార్యంలో లగ్నం చేయడం సాధ్య మవుతున్నది

## 68 ఎంతో తేలిక - అయినా అర్థం కాదు

సంఘ కార్యం చాలా తేలిక కొద్దిగా ఆలోచిస్తే దాని సిద్ధాంతం ఎవరికైనా అర్థమవుతుంది కాని ఎంతో చదువుకొన్న వాళ్ళు కూడా మీరు చేసే పనేమిటో మాకు అర్థం కావడం లేదని అంటుంటారు ఎందుచేత? బహుశా వారు ఎల్లప్పుడు జటిలమైన విషయాలను గురించి ఆలోచిస్తుంటారు ఆ కారణంచేత సరళమైన విషయాలు బహుశా వారి మనస్సులో ఉండక పోవచ్చు అనిపిస్తుంది ఈ సందర్భంలో న్యూటన్ గురించి ప్రచారంలో ఉన్న కథ జ్ఞాపకం వస్తుంది

న్యూటన్ గురుత్వాకర్షణ శక్తిని గురించి పరిశోధనలను జరిపిన మహనీయుడు ఆయన తన గదిలో ఉన్నప్పుడు ఎల్లి తన ఎల్లలతో వచ్చి తలుపు నెట్టుతుండేది మాటిమాటికీ వెళ్ళి తలుపు తీస్తుండడం వేస్తుండడం ఆయనకు ఇబ్బందిగా ఉంది ఆయనకు ఒక ఉపాయం తోచింది వడ్రంగిని పిలిపించి ఈ ఎల్లితో నాకు చాలా ఇబ్బందిగా ఉంది నీవు తలుపులో ఒక పెద్ద రంధ్రము దాని పక్కనే మరొక చిన్న రంధ్రము చేస్తే అవి వాటంతటవి పోతూ వస్తూ ఉంటాయి అన్నాడు

వడ్రంగి ఆశ్చర్యపోయాడు అయ్యా! రెండు రంధ్రాలు ఎందుకు? అని అడిగాడు పెద్ద రంధ్రం పెద్ద ఎల్లికి చిన్న రంధ్రం దాని ఎల్లలకు అని సమాధానం చెప్పాడు న్యూటన్ అప్పుడు వడ్రంగి న్యూటన్ గారూ! ఎల్లకూడా తల్లి వెంటనే పెద్ద రంధ్రం గుండా పోతుంది దానికి వేరే దారి అక్కరలేదు అన్నాడు ఈసారి ఆశ్చర్యపోవడం న్యూటన్ వంతు అయింది అరే ఎంత సులభమైన సంగతి! నాకు స్ఫురించనే లేదు అన్నాడు

సంఘం విషయంలో కూడా పెద్దపెద్ద పండితులు సరిగా ఆలోచించలేకపోతుంటారు

## 69 కర్తవ్య నిష్ఠ

సింహగడ్ (కోండాణా) దుర్గం ప్రసిద్ధికెక్కింది శివాజీ దానిని జయించాలని నిశ్చయించుకొన్నాడు ఈ బాధ్యతను ఎవరు స్వీకరిస్తారు? తానాజీ పేరు గుర్తుకు వచ్చింది ఆయన మహావీరుడు అనేక దుర్గాలను జయించినవాడు వెంటనే తానాజీ వద్దకు దూతను పంపించాడు ఇంతలో తానాజీయే శివాజీ దర్శనానికి వచ్చాడు ఆయన తన కుమారునికి వివాహం

చేసే ప్రయత్నంలో ఉన్నాడు శివాజీ మహారాజుకు దానికి ఆహ్వానించాడు అయనకు మహారాజు నిర్ణయం గు ంచి తెలిసింది

మహారాజా! నిశ ంతగా ఉండండి దుర్గాన్ని జయించే బాధ్యత నాది అన్నాడు నీవు కుమారుని వివాహం సంగతి చూసుకో ఈసారి సైన్యాలను నేనే నడిపిస్తాను అన్నాడు శివాజ మేమందరం ఉండగా మీరు యుద్ధానికి పోవడమేమిటి? ముందు కోట వ్యూహారం చూసి తరవాత ఎల్లవాడి పెళ్ళి చేస్తాను అంటూ పెళ్ళి వాయిదా పడిందంటూ ఇంటికి వర్తమానం పంపాడు తానాజీ

భీకరమైన యుద్ధం జరిగిన తర్వాత కోటను వశపరచుకొన్నాడు కాని ఆ యుద్ధంలో తానాజి మరణించాడు తానాజీ కుమారుని వివాహాన్ని మహారాజు దగ్గర ఉండి జరిపించాడు తానాజీ కర్తవ్యనిష్ఠ గొప్పది కుమారుని వివాహం చాల ముఖ్యమైన విషయం అయినప్పటికీ దేశ శ్రేయస్సు అన్నిటికంటె ముఖ్యం కాబట్టి ఆయన దానికే అధిక ప్రాముఖ్యాన్ని ఇచ్చాడు

## 70 ఆచరణ

నేను ఒక నగరానికి వెళ్ళాను అక్కడ నగరంలోని పెద్దల సమావేశం జరిగింది నేను మామూలు పద్ధతిలోనే సంఘ సిద్ధాంతాన్ని సంఘ కార్య పద్ధతిని వివరించాను చివరకు ఒక పెద్దమనిషి నా దగ్గరకు వచ్చాడు మీకు బహుశా తెలియకపోవచ్చు ఈ సిద్ధాంతాన్ని, పని తీరును మొట్టమొదట ఆలోచించి వాటిని నేనే హెడ్గెవార్ గారికి చెప్పాను మీరు నమ్మకపోవచ్చు ఈ ప్రణాళిక కాపీలు నావద్ద ఉన్నాయి చూడండి

అంటూ దాని ప్రతులను చూపాడు అందులో సంఘటన అంటే ఏమిటి అనుసరించవలసిన పద్ధతులేమిటి అంతా వివరంగా ఉంది

నేను అయ్యా! మీరు ఈ నగరంలో చాలా కాలంనుంచి ఉంటున్నారు గదా! మీకు ఎందరు స్నేహితులున్నారు? అని అడిగాను ఈ ప్రశ్న వినగానే ఆయన గాబరా పడ్డారు ఇదెక్కడి నగరం? ఇక్కడ అంతా మూర్ఖులే నా భావాలను అర్థం చేసుకోగల శక్తి ఒక్కరికీ లేదు అంటూ వాపోయాడు అప్పుడు నేను ఇది సరియైన పనికాదు కనీసం నలుగురు మిత్రులనైనా పోగుచేయాలి ఆఖరు రోజున తీసుకెళ్ళేందుకైనా ఉండాలి కదా! అన్నాను

కేవలం సిద్ధాంతాలను వల్లెవేస్తే చాలదు వాటిపైన గ్రంథాలు వ్రాస్తే చాలదు నిత్యజీవితంలో వాటిని ఆచరణలోకి తీసుకొని రావాలి

## 71 వాక్శూరులు కావద్దు

కొంతమంది చాలా హడావుడిగా పెద్ద పెద్ద మాటలు మాట్లాడుతుంటారు దానిని బట్టి వారు ఏదో లోపాన్ని కప్పిపుచ్చే ప్రయత్నం చేస్తున్నారని మనం ఊహించవచ్చు చాలామంది నాయకులు తమ పార్టీ లేదా వర్గాన్ని ఆకాశానికి ఎత్తేస్తుంటారు అట్లాంటి సందర్భాలలో ఒక కథ గుర్తుకు వస్తుంటుంది

ఒక చిన్న ముంగిస ఉంది దానికి ఒకరోజు ఒక పెద్ద సర్పం కనిపించింది ముంగిసను చూడగానే పాము భయపడింది ముంగిస చిన్నదవడం వల్ల అంతవరకు అది పామును ఎన్నడూ చూడలేదు అందువల్ల అది పామును నీ వెవరు? అని అడిగింది

వెంటనే పాము బుసలు కొడుతూ పడగవిప్పి పైకి లేచింది పెద్ద గొంతుతో నేను సర్పరాజును నీకు తెలుసునో లేదో సాక్షాత్తు విష్ణు మూర్తి అంతటివాడు నన్ను గౌరవిస్తున్నాడు ప్రపంచంలో ఎవరి తల మీద కూడా నా తలపైన ఉన్నటువంటి గుర్తులేదు నన్ను చూస్తే ఎవరికైనా భయం పుడుతుంది జాగ్రత్త! అంటూ పెద్దగా అరచింది

కొద్దిసేపట్లో ముంగిస అన్న దానిని వెదకుతూ అటు వచ్చింది పెద్ద ముంగిసను చూడగానే పాము తన కలుగులోకి జారుకొంది చిన్న ముంగిస పెద్ద ముంగిసకు జరిగి వృత్తాంతమంతా చెప్పి పాము ఎందు కోసం అట్లా పెద్దగా అరుస్తోంది? అని అడిగింది ఏమీలేదు దాని గుండెదడ అట్లా పెద్దగా మాట్లాడేటట్లు చేసింది అని పెద్ద ముంగిస సమాధానం చెప్పింది

పిరికివాడు సాధారణంగా వాక్శూరుడుగా ఉంటాడు వాక్శూరుడు పిరికివాడుగా ఉంటాడు

## 72 పటాటోపం ఎందుకు?

నాకు తెలిసిన పెద్దమనిషి ఒకాయన ఉన్నాడు అయన ఎల్లప్పుడు డబ్బు సంపాదనలో మునిగి ఉండేవాడు విలాసవంతమైన జీవితాన్ని గడుపుతుండేవాడు అందరూ ఆయనను మంచివాడుకాడు అంటుండేవారు కాని ఆయన చాలా నియమాలను తూ చ తప్పకుండా పాటిస్తుండేవాడు చలికాలం ప్రారంభం కాగానే అర్ధరాత్రి ఒక రిక్షాను ఎలిచి దానినిండా దుప్పట్లు వేసుకొని బయలుదేరి రోడ్డుపక్కన చలిలో పడుకొని ఉన్న బిచ్చగాళ్ళకు, బీదవాళ్ళకి వాటిని మాట్లాడకుండా కప్పుతూ దాదాపు రెండు మూడు గంటలు ఊరంతా తిరిగివచ్చేవాడు ఈ విధంగా ఆయన ఏటా

పదిహేనురోజులపాటు చెసేవాడు. ఈ గుప్తదానం ఎవ్వరికీ తెలిసేదికాక ప్రచారం అసలే లేదు. మనవాళ్ళకి మనం సహాయచేస్తే అది పదిమందికీ చెప్పవలసిన పనేముంది?

## 73 అస్పృశ్యు లెక్కడున్నారు?

ఇది శ్రీరాముడు శ్రీకృష్ణుడు జన్మించిన పుణ్యభూమి. ఇక్కడి ప్రతి కణము పవిత్రమైనదే. ఈ పవిత్ర భూమిని తల్లిగా భావించేవారు ఎట్లా అస్పృశ్యులవుతారు? అందువల్ల మనం ఒక పని చేయాలి. రామకృష్ణ పరమహంసను గురించి ఆయన శిష్యులొకరు అన్నారు. ఆ చండాలాత్ అప్రతిహతః యస్య ప్రేమ ప్రవాహః. అదే విధంగా మనం సమాజంలోని అందరిపట్ల ప్రేమభావంతో వ్యవహరించాలి.

ఒకసారి స్వామి వివేకానందకు దాహం వేసింది. ఆయన నీరు త్రాగడం కోసం ఒక బావి దగ్గరకు వెళ్ళారు. అక్కడ ఒక వ్యక్తి నీళ్ళు తోడుతున్నాడు. అతడు స్వామీ! మీరు చూడబోతే బ్రాహ్మణులు. నేను అస్పృశ్యుణ్ణి. మీరు తాగడానికి నీళ్ళు ఎట్లా ఇచ్చేది? ప్రశ్నించాడు. స్వామీజీ అదేముంది? రాముని స్పర్శతో రాయి మనిషిగా మారింది. అటువంటి నీవు మనిషివి. రామ నామాన్ని జపిస్తూ నాకు నీళ్ళు ఇస్తే సంపోతుంది అన్నారు.

## 74 ఇద్దరు సాధువులు

ఒకరోజు రామకృష్ణ పరమహంస వివేకానందుని పిలిచి ఆయనతో 'ఇదెక్కడి న్యాయం? చుట్టూ ఉన్న సమాజాన్ని చూడు. అజ్ఞానంతో

భయంతో దారిద్ర్యంతో ఎట్లా బాధపడుతున్నారో! నీవు హిమాలయాలలో సమాధి స్థితిలో ఉండి అనిర్వచనీయ ఆనందాన్ని పొందుదామనుకొంటు న్నావు ఇది మంచిదేనా? వారిగోడు మానేదెవరు? వారిని ఉద్ధరించేదెవరు? వారికి దారి చూపేదెవరు? ఈ కార్యాన్ని నీవే చేయాలి అన్నారు

తరవాత పరమహంస ఒక కథను చెప్పారు సర్వసంగ పరిత్యాగి యైన సాధువు ఒకరు అనేక శ్రమలకోర్చి హిమాలయాలను చేరుకొన్నాడు ఆ సుందర దృశ్యాన్ని చూస్తూ తన్మయత్వంలో క్రింద పడిపోయాడు కనీసం అయన దేహం కూడా ఎవరికీ కనిపించలేదు

కొద్దిరోజుల తరవాత మరొక సాధువు అక్కడికే వచ్చాడు ఆయన కూడ ఆ సుందర దృశ్యాన్ని చూసి తన్మయుడైనాడు కాని వెంటనే ఆయన మనస్సు విషాదంతో నిండిపోయింది ఈ సౌందర్యాన్ని గురించి ఈ ప్రశాంతతను గురించి ప్రజలలో ఎవ్వరికీ తెలియదు కదా! నేను గ్రామ గ్రామానికి వెళ్ళి వారి ఈ సంగతి చెబుతాను వారిని ప్రోత్సహించి వారికి గూడ ఈ ఆనందాన్ని కలుగజేస్తాను అంటూ తిరిగి వెళ్ళాడు ఆ పనికోనే జీవితాన్ని గడిపాడు

ఇదే విధంగా మనంకూడ సంఘ కార్యంలో పొందుతున్న పరమా నందాన్ని నలుగురికీ పంచి పెట్టాలి ఇంటింటికీ వెళ్ళి చెప్పాలి నడవండి దేశంకోసం, ధర్మంకోసం ఒకచోట చేరండి ఆత్మీయతవల్ల లభించే ఆనందాన్ని అనుభవించండి అంటూ రెండో సాధువును అనుకరించాలి

## 75 నిజం చెప్పే ధైర్యం ఉండాలి

నిజం అందరికీ తెలుస్తూనే ఉంటుంది అయితే ఆ నిజాన్ని చెప్పే ధైర్యం చాల కొద్దిమందికి ఉంటుంది స్వార్థపరులు బలహీనులు ఎరికి

వారు నిజాన్ని భరించలేరు వెలుతురు రాగానే దొంగలు అడవులలోను చాటుమాటున దాగినట్లుగా వీరు అసత్యాన్ని మోసాన్ని ఆశ్రయిస్తారు

ఒకరోజు ఒక నేత పనివాడు అందమైన సన్నని వస్త్రాన్ని రాజు గారి దర్బారుకు తెచ్చాడు దానిని చూసిన రాజు అతని పనితనాన్ని మెచ్చు కొన్నాడు ఇది విన్న సభికులుకూడా ఆ వస్త్రం గుణాలను పొగడసాగారు పనివాడు రాజుగారితో మహారాజా! నిజానికి ఇదేమంత గొప్ప వస్త్రంకాదు తాము అనుమతిస్తే ఇంతకంటే పలుచనిది అందంగా ఉండేది తయారు చేస్తాను చక్రవర్తులకు సహితం అటువంటి వస్త్రాన్ని ధరించే అవకాశం లభించదు అని విన్నవించాడు వెంటనే రాజుగారు అత్యుత్తమమైన వస్త్రాన్ని తయారుచేయించు ఖర్చు ఎంతఅయినా నేను ఇస్తాను అన్నాడు

నేత పనివాడు గొప్ప మోసగాడు అతనికి ప్రత్యేకంగా ఒక భవనాన్ని ఇచ్చారు సామగ్రికోసం కోరినంత ధనం ఇచ్చారు భవనానికి కట్టుదిట్టమైన కాపలా ఏర్పాటు చేశారు మగ్గం పనిచేయడం ప్రారంభమైంది బయట ఉన్నవారికి మగ్గం చప్పుడు వినిఎస్తూనే ఉంది లోపల గుడ్డ మాత్రం తయారు కావడంలేదు అసలు నూలే లెదు కొద్దిరోజుల తరవాత రాజుగారు అక్కడ పని ఎట్లా జరుగుతున్నదీ చూడటానికి వెళ్ళాడు పనివాడు అద్భుతంగా నటిస్తూ చేతిలోమాయి గుడ్డను పట్టుకొని దాని గొప్పతనాన్ని రాజుకు వివరించాడు రాజు కూడా ఆ అదృశ్య వస్త్రాన్ని పట్టుకొని చూసి మెచ్చుకొన్నాడు

మరుసటి రోజు సభికులలో కొందరు అక్కడికి వెళ్ళారు పనివాడు వారికి ద్వారం వద్దనే స్వాగతమిచ్చాడు అత్యంత వినయంతో నిన్ననే రాజుగారు వచ్చి చూశారు వారికి వస్త్రం ఎంతగానో నచ్చింది దుస్తులను

చెయమన్నారు మీరు ఒక సంగతి గుర్తుంచుకొండి రాజభక్తి ఉన్నవారికి మాత్రమే అది కనిపస్తుంది అంటూ వారిని సాదరంగా లోపలికితీసుకొని వెళ్ళాడు అంతా వస్త్రాన్ని మెచ్చుకొన్నారు తమకు కూడా దుస్తులు తయారుచేయమన్నారు అన్ని దుస్తులు తయారైనాయి

నూతన అద్భుత వస్త్రాలను ధరించి రాజు ఇతర సభికులు నగర సందర్శనకు బయలుదేరారు స్త్రీలు, పురుషులు వృద్ధులు బాల బాలికలు పురవీధులలో ఇరువైపులా బారులుతీరి నిలుచున్నారు ఊరేగింపు మొదలైంది అందరూ నిశ్శబ్దంగా చూస్తున్నారు రాజుగారు ఏనుగుపై ఉన్నారు ఆయనవెంట సభికులు వివిధ వాహనాలను అధిరోహించి వెళుతున్నారు ఇంతలో అరుగుమీద నిలుచన్న బాలుడు పెద్దగా ఇదెక్కడి ఊరేగింపు? ఎవ్వరి వంటిమీద బట్టలు లెవు! అంటూ అరిచాడు ప్రజలలో గుసగుసలు మొదలైనవి నిజమే మనకు గూడా ఏమీ కనిపించడం లేదు చిన్నపిల్లవాడైనా నిజాన్ని ఎంత నిర్భయంగా చెప్పాడు! అన్నారు క్రమంగా ఈ గుసగుసలు పెద్ద రణగొణధ్వనిగా తయారై చివరకు రాజుగారి చెవికి చేరింది అందరు సిగ్గుతో తలవంచుకొని ఇళ్ళకు చేరారు

మనది హిందూరాష్ట్రం అనాదిగా ఉన్న రాష్ట్రం చిరంతనమైనది ఈ విషయం అందంకీ తెలుసు కాని దానిని చెప్పే ధైర్యంమాత్రం ఎవ్వరికి లేదు సముద్రాన్ని దాటి వచ్చిన కుటిలురైన ఆంగ్లేయులు తప్పుడు ప్రచారం చేసారు ఆ తప్పుడు ప్రచారానికి పెద్ద చిన్న అంతా తల వంచారు స్వార్థరహితుడు శీల సంపన్నుడు అయిన డాక్టర్జీ ఒక్కడే ఆనాటి బాలుని వలె ఇది హిందూరాష్ట్రం సనాతన హిందూ రాష్ట్రం! అని గర్జించాడు

# 76 మన కర్తవ్యం

ఒక మంచి మేధావియైన యువకుడ ండేవాడు అతడు మంచి వక్త స్ఫురద్రూపి కష్టపడి పని చేసేవాడు అధ్యయన శీలి అతడు ఎవరిని కలిసినా వారు అతనిని పొగడుతుండేవారు ఒకడు నీ వాక్పటిమ అమోఘము నీ సంభాషణా చాతుర్యము నిరుపమానము న్యాయవాద వృత్తిని చెపట్టు ప్రధాన న్యాయమూర్తివి కాగలవు అన్నాడు

మరొకడు నీ ఆలోచనా శక్తి అసాధారణము నీ భావావేశము గొప్పది మౌలిక భావాలను వ్యక్తము చేస్తున్నావు ప్రొఫెసరు కాగలవు అన్నాడు ఇంకొక స్నేహితుడు అతని శ్రద్ధను గుర్తించి వివిధ పరిశ్రమలను గురించి వివరిస్తుండేవాడు మరొక మిత్రుడు నీకు తగిన సౌందర్యవతిని వెదకి పెండ్లి చేస్తాను అంటుండేవాడు

ఒకరోజు ఆ యువకుడు చెప్పింది విని నలుగురూ ఆశ్చర్యపోయారు నేను సర్వసంగ పరిత్యాగినై సన్యసిస్తాను అన్నాడు నలుగురూ అతనిని చుట్టుముట్టి ప్రశ్నల వర్షం కురిపించారు అతడు వారితో అయ్యలారా! మీ ఆదరానికి కృతజ్ఞుడను నేను ఎవరి మీదనో కోపంతోను లేదా నిరాశ వల్లనో లేదా భయం వల్లనో ఈ నిర్ణయాన్ని తీసుకోలేదు మానవ జీవితానికి ఉన్నతమైన లక్ష్యం ఉంది పరిశ్రమలను స్థాపించడం ఉద్యోగం చేయడం పదవులు సంపాదించడం కంటె శ్రేష్ఠమైనది నేను నా సర్వశక్తులను ఈశ్వర సాక్షాత్కారం కోసం ధార పోస్తాను అన్నాడు అతని స్థిర నిశ్చయాన్ని చూసి అందరూ ఆశ్చర్యపోయారు

సంఘం పనిని గురించి కూడా నలుగురూ నాలుగు రకాల సలహాలిస్తుంటారు మనంవారి మాటను విననప్పుడు వారికి కోపం వస్తుంటుంది అనేక ఆరోపణలు చెస్తుంటారు కాని సంఘం తన బాటను వీడదు

# 77 మాటకు చేతకు పొంతన ఉండాలి

మనం సంఘం పని చేస్తున్నాము మనం చేసే పనికి చెప్పే మాటలకు పొంతన ఉండాలి నీతిని గురించి బోధించేవారికి శీలసంపద ఉండాలి

ఒక పిల్లవాడికి తీపి అంటే చాలా ఇష్టము వాడు బెల్లం ఎక్కువగా తింటుండేవాడు అందువల్ల వాని ఆరోగ్యం దెబ్బతిన్నది తండ్రి వైద్యుని పిలిపించి చూపాడు వైద్యుడు పరీక్షించాడు బాలునికి సంబంధించిన అన్ని విషయాలను అడిగి తెలుసుకున్నాడు బెల్లం తినడం గురించి ఏమీ ప్రస్తావించలేదు మళ్ళీ మూడు వారాల తరువాత రమ్మన్నాడు అదే విధంగా తండ్రి బాలుని వైద్యుని వద్దకు తీసుకొని వచ్చాడు వైద్యుడు బాలునితో బెల్లం తినడం వల్ల నీ ఆరోగ్యం పాడైంది ఇకముందు తిన వద్దు అని చెప్పాడు తండ్రితో పిల్లవానిని గురించి తీసుకోవలసిన చర్యలను వివరించాడు

బాలుడు బెల్లం తినడం మానివేశాడు కొద్ది రోజులలోనే అతని ఆరోగ్యం మెరుగైంది తండ్రి ఆశ్చర్యపోయాడు ఆయన వైద్యుని మీరు మొదట రోగాన్ని సరిగా గుర్తించలేదా? ఎందుకు మూడు వారాలు తీసుకొన్నారు? అని అడిగాడు నాకు రోగము రోగకారణము మొదటనే తెలిశాయి అయితే సలహా చెప్పేందుకు నేను సాహసించలేదు నాకు కూడా బెల్లం తినే అలవాటున్నది ఆ అలవాటును మానడానికి నాకు మూడు వారాలు పట్టింది దానితో నాకు నమ్మకం కుదిరింది అప్పుడు మీ అబ్బాయికి సలహా చెప్పాను అన్నాడు

దీనివల్ల మనకు తెలిసేది ఒక్కటే ఆలోచనకూ ఆచరణకూ పొంతన ఉన్నప్పుడే సంఘకార్యాన్ని చేయగలుగుతాము

# 78 సంఘకార్యం యొక్క గొప్పదనము

సంఘం పని చేసేటప్పుడు మనకు ఒక గొప్ప అనుభవం కలుగుతుంది మన హృదయంలో ఆత్మీయతా భావ ప్రవాహం ఉన్నదనిపిస్తుంది కొత్తా పాతా అనే తేడా లేకుండా అందరు కలిసిమెలసి ఉంటారు

ఈ విషయంలో నాకొక చిన్న అనుభవం కలిగింది ఒకసారి పర్యటనలో వెళ్ళవలసిన గ్రామం స్టేషన్‌కు సుమారు 70 మైళ్ళ దూరంలో ఉంది స్థానిక కార్యకర్తలు కారు తీసుకొనివచ్చారు అందులో ప్రయాణం చేశాము సాయంత్రానికి గ్రామం చేరాము నా బట్టలు అన్నీ దుమ్ముకొట్టుకొని ఉన్నాయి తల మీద వంటి మీద దుమ్ము రూపం చూడడానికి బాగా లేదు ఒక స్వయంసేవక్ ఇంటికి తీసుకొని వెళ్ళారు ఆ ఇంట్లో చిన్నా పెద్దా అంతా సంఘ స్వయంసెవకులే అక్కడికి ఇద్దరు ప్రసిద్ధ న్యాయవాదులు కూడా వచ్చారు ఆ ఇంట్లో ఇద్దరు చిన్న పిల్లలున్నారు వారు నా వద్దకు వచ్చారు ఒకడు నా వడిలో కూర్చొని తనకు వచ్చీరాని భాషలో ఏమో చెబుతున్నాడు ఇంకొకడు నా గడ్డంతో ఆడుకొంటున్నాడు నాకు చాలా ఆనందంగా ఉంది అక్కడి పెద్ద మనుషులలో ఒకరు మీకు ఈ పిల్లలు మొదటినుండి తెలుసా? వారు ఏమాత్రం భయం లేకుండా మీతో ఆడుకొంటున్నారు! అంటూ ప్రశ్నించారు నాకు తెలియదు ఇప్పుడే చూస్తున్నారు ఇక్కడ మనం ఆత్మీయతతో నిండిన వాతావరణంలో ఉన్నాము చిన్నా పెద్దా కొత్తా పాతా భేదం లేకుండా స్నేహపూరితంగా వ్యవహరిస్తున్నాము ఇది సంఘకార్యంలోని గొప్పదనము అని వివరించాను

# 79 వీరవ్రతం

మనం పవిత్రమైన సంఘకార్యాన్ని శాంతచిత్తంతో ఎవ్వరి పట్లా ద్వేషభావం లేకుండా నిర్వహిస్తుంటాము మనకు అనేక అవరోధాలు ఎదురవుతుంటాయి వాటిని అధిగమించి విజయాన్ని పొందడంకోసం మన శరీరం దృఢంగా ఉండాలి మన మనస్సు నిర్మలంగా ఉండాలి నిశితమైన బుద్ధికలిగి ఉండాలి స్వయం సేవకులు తమ నిత్య జీవనంలో వీటన్నింటిని సాధించాలి ఎటువంటి సంకోచం లేకుండా పనిలో ముందంజ వేయగల సామర్థ్యాన్ని వీరవ్రతం అంటారు స్వయం సేవకులు వీరవ్రతులుగా ఉండాలి

శృంగేరికి సమీపంలో ఒక శివాలయం ఉంది ఒక రోజు శంకరాచార్యులవారు ఆలయంలో పూజ చేస్తున్నారు ఇంతలో అక్కడికొక పెద్ద సర్పం బుసకొడుతూ వచ్చింది శిష్యులు గాభరా పడ్డారు శంకరాచార్యులు తన కనుసన్నతో వారిని గోల చేయవద్దని వారించి ప్రశాంత చిత్తంతో పూజను కొనసాగించారు పాల గిన్నెను పాము ముందుంచారు పాలను తాగి అది తన దారిన వెళ్ళిపోయింది కష్టాలు వచ్చినపుడు మనం మన సాధనను విడనాడరాదు

# 80 శుద్ధభక్తి

కొందరు పాత స్వయం సేవకులకు సంఘాన్ని గురించి అంతా తెలుసు కాని వారు సంఘకార్యానికి దూరంగా ఉంటారు వారిని గురించి డాక్టర్‌జీ అంటుండేవారు వారి మనస్సులో సంఘానికి సంబంధించిన

జ్ఞానం పూర్తిగా ఉంది కాని వారి హృదయాంలో మాతృభూమిపట్ల భక్తి లోపించింది శుద్ధభక్తి ప్రేరణదాయని భక్తి లోపించడంవల్ల మనుష్యులు అన్ని విషయాలు తెలిసినప్పటికి క్రియాశూన్యులుగా ఉంటారు

ఈ విషయాన్ని వివరిస్తూ డాక్టర్జీ వేదవ్యాసునికి సంబంధించిన కథను చెబుతుండేవారు వేదవ్యాసుడు నాలుగు వేదాలను అధ్యయనం చేసినవాడు ఆయన బ్రహ్మసూత్రాల రూపంలో వేదసారాన్ని వివరించాడు అందరికీ అర్థమయ్యేందుకు తేలికైన భాషలో పురాణాలను రచించాడు ఇంతటి సాహిత్య సృష్టిచేసిన తరువాత కూడా ఆయన మనస్సులో ఏదో వెలితి ఆందోళన అసంతృప్తి ఉంది ఒక రోజు ఆయన సరస్వతీ నదీ తీరంలో విచారంగా కూర్చొని ఉన్నాడు నారదుడు అక్కడకు వచ్చాడు ఆయన వ్యాసునితో మీరు భగవంతుని లీలలను వర్ణించండి అందువల్ల మీ హృదయంలో భక్తి భావన ఉత్పన్నమవుతుంది మనస్సులోని అశాంతి తొలగుతుంది అన్నాడు

వ్యాసుడు భాగవతాన్ని రచించాడు ఆయనకు సుఖ శాంతులు కలిగాయి ప్రతి స్వయం సేవక్ భారతమాత యొక్క భక్తుడు కావాలని డాక్టర్జీ అంటుండేవారు

